





# ప్రిట్ గ్లూ స్టిక్

## చాలా సులభమైన పరిశుభ్రమైన పద్ధతి కాగితాలనంటించే దానికి

చాలా సులభమైనది. చాలా శుభ్రమైనది. చాలా తొందరైనది.

- పుస్తకాల అట్టలకు.
- లేబుల్స్ అంటించేదానికి.
- బొమ్మలు మరియు ఆట వస్తువుల తయారీకి.
- గాలి పటాల మరమ్మత్తులకు (రిపేర్లకు).
- ఫోటోలు మరి స్టాంపుల అతికింపులకు.
- బహుమతులను అందంగా కట్టేదానికి.
- ఇంకా, ఎన్నో ఎన్నెన్నో.

నేడే... మీ మమ్మిని ఒక కోరస్ ప్రిట్ గ్లూ స్టిక్‌ను మీ పుస్తకాల దుకాణము నుండి కానీ, లేక జనరల్ స్టోర్సు నుండి కానీ, తప్పక కొని తెమ్మని చెప్పండి.

ప్రిట్ గ్లూ స్టిక్ - చాలా పరిశుభ్రమైన వినోదము.




**kores**® మార్కెట్ చేయువారు: కోరస్ (ఇండియా) లిమిటెడ్, బొంబాయి-18
తయారు చేయువారు: వాప్సన్ కెమికల్ ప్రొడక్ట్సు ప్ర. లి. బొంబాయి-7
Henkel ప్రిట్® హెన్కెల్ జర్మనీ వారి,
రిజిస్టర్డు ట్రేడ్‌మార్కు.

AKA-422-TL


















వినోద పర్యటన శాఖ, భారత ప్రభుత్వం

ఏయ్! ఈ రాతిమీద పుర్రె, అర్థ ఎముకలు

లోపలకి వెడితే మహారాజులు విజేతలు మీ చుట్టూ తిరుగుతున్న భావం మీకు కలుగుతుంది.

ఎంత పవిత్రత! ఎంత ప్రశాంతత.

కానియీ గోకుతున్న శబ్దం, సుత్తి చప్పుడు ఏమిటి?

THAK THAK

THAK

TONY ♥ S

దొరికారు!

చూడు, నువ్వు చరిత్రను హత్యచేస్తున్నావు, మన ప్రాచీన సంపదని నాశనం చేస్తున్నావు.

TONY ♥ S

ఎంత పెద్ద నేరం. చూడు, నీ కు ఏమి అవుతుందో?

మేము నీ మోటారు సైకిల్ నంబరు వ్రాసుకున్నాం. మేము పోలీసులకు ఫిర్యాదు చేస్తాం.

మేం సిగ్గుపడుతున్నాం. ఇంతకంటె బుద్ధి తక్కువపని వేరే ఉండదు.

నేను బాధపడుతున్నా. మళ్ళీ ఎప్పుడు చేయను.

మళ్ళీ ఎప్పుడు చేయకపోవడమే కాదు. ఇతరులు యిటువంటి తెలివితక్కువ పనులు చేయకుండా నువ్వు అడ్డుపడాలి.

మేము స్పృశిస్తాం, మేము రక్షిస్తాం.

భారతదేశపు అపురూపమైన అందాలు

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'          సంచాలకుడు : నాగిరెడ్డి

## శుభాకాంక్షలు—విజ్ఞప్తి

ఏ రంగంలోనైనా మార్పులు రావడం సహజం. సాంఘిక, రాజకీయ రంగాలలో మార్పుకు దోహదం చేసే ప్రతి ఒక్క సంఘటనా ముఖ్యమైనదే. ప్రజలందరూ ప్రగతిని కాంక్షించి, ఆ ప్రజాభీష్టాన్ని నెరవేర్చడానికి నాయకులు చిత్తశుద్ధితో కృషి. చేసినట్టయితే మార్పు—ప్రగతికీ, అభ్యున్నతికీ దోహదం చేస్తుంది.

మన దేశంలో శ్రీ వి. పి. సింగ్ నాయకత్వంలో కొత్త మంత్రి మండలి ఏర్పడింది. నూతన ప్రధానికి. భారత ప్రజలందరితోపాటు మేమూ మా శుభాకాంక్షలు అందజేస్తున్నాము. నేటి బాలలే భావి భారత నిర్మాతలన్న విషయం అందరికీ తెలిసినదే. రేపటి పౌరుల సౌభాగ్యానికీ, మానసిక వికాసానికీ పెద్దలు తమ బాధ్యతలను సక్రమంగా నిర్వర్తిస్తున్నారా ? ఇటీవల కొన్ని సంవత్సరాలుగా పత్రికా ప్రచురణ రంగంలో అన్నిటి ధరలూ పెరిగిపోయాయి. ముఖ్యంగా కాగితం ధర విపరీతంగా పెరిగిపోవడంతో, అనేక ఇబ్బందులకు లోనయ్యాము. ఇలాంటి క్లిష్టపరిస్థితులలో పిల్లలపట్ల మా బాధ్యతను ఎలా నిర్వర్తించగలం ? బాలల పఠనానందం కోసం, విద్యకోసం తల్లిదండ్రులపై మరింత బరువును మోపడం భావ్యమవుతుందా ? ఈ క్లిష్టసమస్యను పరిశీలించి సత్వర పరిష్కారమార్గం చూపవలసిందిగా పాలకులకు సవినయంగా విన్నవించుకుంటున్నాము. ఎందుకంటే, పిల్లలకు మంచి పౌష్టికాహారం ఇవ్వడంలాగే, వాళ్ళలో పఠనాసక్తిని పెంపొందించడం కూడా చాలా ముఖ్యమని మేము విశ్వసిస్తున్నాము.

సంపుటి 86          జనవరి '90          సంచిక 1

విడి ప్రతి : 3-00          ; ;          సంవత్సర చందా : 36-00









# విభజన కుడ్య పతనం!

చీనా మహాకుడ్యం గురించి అందరికీ తెలిసిందే. దురాక్రమణదారులనుంచి చీనా సరిహద్దులను పరిరక్షించడానికి, చాలా కాలం కిందట ఆ మహాకుడ్యం నిర్మించబడింది. అది ప్రపంచంలోని ఏడు వింతలలో ఒకటిగా ప్రసిద్ధి గాంచింది!

ఇటీవలి కాలంలో అంటే—1961వ సం॥ మరొక మహాకుడ్య నిర్మాణం జరిగింది. ఈ గోడను కట్టడంలోని ఉద్దేశం మాత్రం మునుపటిదానికి పూర్తిగా వ్యతిరేకమైనది. తమ దేశంలోని ప్రజలు పొరుగుదేశానికి పారిపోకుండా వుండాలని పాలకులు ఈ గోడ కట్టారు!

ఈ పరిస్థితి ఎందుకు ఏర్పడిందో తెలుసుకోవాలంటే మనం రెండవ ప్రపంచయుద్ధం నాటి చరిత్రపుటలను కాస్త తిప్పిచూడాలి:

జర్మనీ నియంత హిట్లర్ ప్రపంచాన్ని జయించడానికి పూనుకుని, 1945వ సం॥ పరాజయం పాలయ్యాడు. అప్పుడు అతని రాజధాని నగరం బెర్లిన్, రెండు ప్రధాన భాగాలుగా విభజించబడింది. మొదటిభాగం పశ్చిమబెర్లిన్—బ్రిటన్, అమెరికా, ఫ్రాన్స్‌దేశాల అధీనంలోకి వచ్చింది. రెండవ భాగమయిన తూర్పు బెర్లిన్—సోవియట్ రష్యా అదుపులోకి వచ్చింది. (హిట్లర్‌నూ అతని భాగస్వాములనూ ఓడించడంలో ఈ నాలుగు దేశాలూ ప్రముఖపాత్ర వహించాయి.)

1955వ సం॥ రెండు బెర్లిన్లూ స్వతంత్ర దేశాలయ్యాయి. తూర్పు బెర్లిన్—'జర్మన్ డెమొక్రటిక్ రిపబ్లిక్'గానూ, పశ్చిమ బెర్లిన్—'జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్'గానూ రూపొందాయి. రెండు దేశాలూ భిన్నమైన రాజకీయ సిద్ధాంతాలను అనుసరించాయి. పేరులో 'ప్రజాస్వామ్యం' (డెమొక్రటిక్) ఉన్నప్పటికీ తూర్పుజర్మనీ, కమ్యూనిస్టు దేశమయింది. పశ్చిమజర్మనీ మాత్రం ప్రజాస్వామ్య మార్గంలో పయనించింది.

అనేక కారణాలవల్ల, పశ్చిమజర్మనీ, తూర్పు జర్మనీకన్నా వివిధ రంగాలలో త్వరితపురోగతిని సాధించసాగింది. అన్నిటినీమించి, పశ్చిమ జర్మనీలో పౌరులకు తమ అభిప్రాయాలను ధైర్యంగా వెలిబుచ్చే స్వతంత్రం ఉన్నది. తూర్పుజర్మనీ వాసులకు అటువంటి స్వతంత్రం కరువయింది.

క్రమంగా తూర్పు బెర్లిన్ నుంచి కొందరు పశ్చిమబెర్లిన్‌కు వలస పోసాగారు. మరికొందరు

అక్కడి తమ బంధుమిత్రులను కలుసుకోవడానికి తరచూ వెళ్ళి రాసాగారు. అయితే, తూర్పు జర్మనీ ప్రభుత్వం దీనిని నిషేధించింది. రాకపోకలను అరికట్టడానికి సరిహద్దు పొడవునా ఎత్తయిన విభజనగోడను నిర్మించింది! ఎవరైనా గోడదూకి వెళ్ళడానికి ప్రయత్నిస్తే, తూర్పుబెర్లిన్ పోలీసులు కాల్చసాగారు. ఆ కారణంగా సామాన్య ప్రజలలో ఆ గోడపట్ల ఏహ్యాభావం ఏర్పడింది. నిరసన ప్రబలింది. పైగా తూర్పుజర్మనీ ప్రజానీకంలో స్వాతంత్ర్యదాహం ఎక్కువయింది. ఎల్లప్పుడూ ఒకే పార్టీ పాలనకింద ఉండడంకన్నా, తమ కిష్టమయిన పార్టీని ఎన్నుకునే హక్కు కావాలన్నకోరిక ప్రజల హృదయాలలో బలపడసాగింది.

అఖరికి, ఇటీవల తూర్పుజర్మనీ ప్రభుత్వం, రెండు బెర్లిన్లను విభజిస్తున్న గోడ ద్వారాలను తెరవడానికి నిశ్చయించింది. దానిని చూసి వేలాది మంది ప్రజలు ఆనందోత్సాహాలతో నాట్యం చేశారు. పశ్చిమ బెర్లిన్ పౌరులకు కూడా ఇది చాలా సంతోషకరమయింది. ఆనందాతిరేకంతో, కొందరు ఈ విభజనకుడ్యంలో కొంత భాగాన్ని పడగొట్టారు కూడా!

బెర్లిన్ గోడపతనాన్ని—మనిషిలోని స్వాతంత్ర్య దాహ విజయానికి సంకేతంగా పరిగణించవచ్చు!






# బెస్తవాడి కోరిక

గౌరీపురం అనే గ్రామానికి సమీపానగల, ఒక నీటివాగువద్ద, లక్ష్మణుడనే బెస్త వాడు, ఒక పూరిపాక వేసుకుని, అందులో భార్యాబిడ్డలతో చాలా కాలంగా నివసిస్తూండే వాడు. వాడున్నచోట వాగు బాగా లోతుగా వుండి, నీటివేగం తక్కువగా వుండేది. ఆ కారణంవల్ల, వాడి వలలో చేపలు బాగా పడుతూండేవి. లక్ష్మణుడు వాటిని దగ్గిర్లో వున్న పట్టణంలో అమ్మి, వచ్చిన డబ్బుతో కుటుంబాన్ని హాయిగా పోషిస్తూ ఉండేవాడు.

ఒక రోజున ఇద్దరు రాజభటులు, బెస్తవాడి దగ్గిరకు వచ్చి, "మహారాజు చంద్రసేనుడు ప్రజలబాగోగులు తెలుసు కునేందుకు దేశపర్యటన చేస్తూ, త్వరలో ఇక్కడికి రానున్నారు. వారు విడిది చేసేందుకు, ఈ ప్రదేశం చెట్టూ చేమలతో, ఎడతెగకపారే నీటివాగుతో అనువుగా చాలా అందంగా వున్నది. నువ్వు వెంటనే ఈ స్థలాన్ని ఖాళీ చేసిపో!" అన్నారు.

చేసేదిలేక బెస్తవాడు తన నివాసాన్ని, పాతనివాసానికి దూరంగా, వాగు ఒడ్డున మరొకచోటుకు మార్చుకున్నాడు. అయితే, అక్కడ వాగులో నీటిలోతు తక్కువ; వేగం ఎక్కువ. అందువల్ల, వాడికి పూర్వంలా వలలో చేపలు పడడం తగ్గి పోయింది. దొరికిన కొద్ది చేపలు అమ్మగా వచ్చిన డబ్బుతో, కుటుంబపోషణ కష్టమై పోయింది.

నెలలు గడుస్తున్నా, రాజు, బెస్త వాడు ఖాళీచేసిన ప్రదేశంలో విడిది చేసేందుకు రాలేదు. వాడికి క్రమంగా తన పాతనివాసానికి పోవాలన్న తపన ఎక్కువైంది.

బెస్తవాడు ఒకసారి వాగువద్ద వున్న రాజభటులను కలుసుకుని, తన

భీమవరపు పురుషోత్తం



ఇక్కట్లు చెప్పుకుని, "మహారాజుగారు త్వరగా వచ్చి వెళితే బావుండును. ఇంతకూ వారెప్పుడు ఈ వాగు దగ్గరికి వస్తారు?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు భటులు కోపంగా, "రాజుగారు యిక్కడికెప్పుడు వస్తారో వారికీ, మహారాణిగారికీ తప్ప మరెవళ్ళకూ తెలియదు. రాజుగారు వచ్చి విడిది చేసి వెళ్ళాకే, నీకిక్కడ నివాసం. అంతవరకు మరెప్పుడు గాని ఈ చాయలకు రాకు వెళ్ళు!" అన్నారు.

బెస్తవాడు మరొకవారం రోజులు చూసి, కుటుంబపోషణ మరింత కష్టం కావడంతో, ఇక భరించలేక రాజుగారితోనే మాట్లాడుదామని, బయలుదేరి తిన్నగా రాజధానీనగరం చేరాడు.

అయితే, అక్కడ కోటద్వారం దగ్గిరున్న కాపలాభటులు, వాణ్ణి ఆపి, "రాజుగారి దర్శనం అంత తేలిక్కాదు. కావాలంటే ద్వారానికి కాస్త పక్కగా నిలబడు; ఒక గంట తర్వాత మంత్రిగారు ఇటే వస్తారు. నీ గోడేమైనా వుంటే, ఆయనతో చెప్పుకో," అన్నారు.

"నాకు మంత్రిగారితో పనేంలేదు. రాజుగార్నే చూడాలి," అన్నాడు బెస్తవాడు.

భటులు వీడెవడో అమాయకుడనుకుని, రాజుగారిప్పుడు కోటలో లేరు, రేపు రమ్మని చెప్పారు.

"అయితే, రాజుగారు, మా ఊళ్ళో వాగు ఒడ్డున విడిది చేయడానికి వెళ్ళి వుంటారు!" అన్నాడు బెస్తవాడు సంతోషంగా.

భటులు కోపగించుకుని, "ఊరూ లేదు, వాగూలేదు. పోయిక్కణ్ణించి!" అని కసిరారు.

మేడ పైభాగం నుంచి ఇదంతా చూస్తున్న రాజు చంద్రసేనుడు, భటుణ్ణి పంపాడు.

భటుడు బెస్తవాణ్ణి రాజు దగ్గరకు తీసుకుపోయాడు. ఆ సమయంలో మహారాణి కూడా అక్కడనే వున్నది.

బెస్తవాడు, రాజుకు నమస్కరించి, "మహారాజా, మా ఊళ్ళోని వాగు ఒడ్డున విడిది చేసేందుకు ఎప్పుడొస్తారు?" అని అడిగాడు.

రాజు ఆశ్చర్యపోయి, "నువ్వెవరు? నీ ఊరెక్కడ? వాగేమిటి?" అని ప్రశ్నించాడు.

బెస్తవాడు తన పేరూ, తానున్న ఊరి పేరూ చెప్పి, కొన్ని నెలలకిందట రాజభటులు తనచేత వాగు సమీపంలో వున్న పూరిపాకను ఎలా ఖాళీ చేయించిందీ పూర్తిగా వివరించి, "ఇప్పుడు కొత్తగా నేనున్న ప్రదేశం చేపలు పట్టడానికి ఏమాత్రం అనువైందికాదు. మీరు వెంటనే మా ఊరు వచ్చి, వాగు ఒడ్డున విడిది చేసి వెళితేతప్ప, లేకపోతే నాకూ, నా భార్యాబిడ్డలకూ రోజూ పస్తులు తప్పవు. దయతలచి నా కోరిక మన్నించండి!" అన్నాడు ఎంతో దీనంగా.

వాడి మాటలకు రాజు చిరునవ్వు నవ్వి, రాణీతో, "చూశావా? నాదేశ పర్యటన వల్ల లాభపడేవాళ్ళతోపాటు, నష్టపోయే వాళ్ళు కూడా వున్నారన్నమాట!" అన్నాడు.

"అయితే, యీ బెస్తవాడికేమైనా నష్టపరిహారం యివ్వబోతున్నారా?" అని అడిగింది రాణి.

"అలాంటిదేం లేదు. వీడి అమాయకత్వానికీ, సరాసరి నన్ను చూడవచ్చిన వీడి ధైర్యానికీ మెచ్చి, బహుమతి యివ్వబోతున్నాను," అని, రాజు కోశాధికారిని పిలిపించి, బెస్తవాడికి నూరు వరహాలు ఇప్పించాడు.

తర్వాత ఆయన, వాడితో, "నీ వెంట భటుణ్ణొకణ్ణి పంపుతాను, నీ ఊళ్ళో వున్న భటులిద్దరూ, నువ్వు తిరిగి పాత చోటున నివాసం ఏర్పరచుకునేందుకు ఎలాంటి అభ్యంతరం చెప్పరు. వెళ్ళి, భార్యాబిడ్డలతో సుఖంగా బతుకు," అన్నాడు చిన్నగా నవ్వుతూ.

బెస్తవాడు పరమానందంతో, తన ఊరుకేసి బయలుదేరాడు.





# సన్యాసిశాపం

పూర్వం శిళ్ళంగేరి అనే గ్రామంలో, వీరేంద్రుడనే యువకుడుండేవాడు. వాడు మంచి బలశాలి; అందగాడు. కానీ చాలా పేదవాడు. రోజూ అడవికి వెళ్ళి కట్టెలు కొట్టి తెచ్చి, వాటిని అమ్మగా వచ్చిన డబ్బుతో జీవిస్తూండేవాడు.

ఒకనాడు వాడు అడవిలో, ఒక చెట్టు ఎక్కి కొమ్మలు నరుకుతూండగా, వాటిలో ఒకటి, చెట్టుకిందగా నడిచిపోతున్న సన్యాసిమీద పడింది. సన్యాసి ఆగ్రహావేశంతో మెడలోని రుద్రాక్షమాలనొకదాన్ని నేలకువేసి కొట్టి, "ఒరే, దుష్టుడా! కండకావరంకొద్దీ, చెట్టుకిందినుంచి ఎవరు పోతున్నారో గమనించకుండా, కొమ్మలు నరికి నన్ను గాయపరుస్తావా? అహంకారివయిన నువ్వు తక్షణం రాక్షసుడివైపోయి, ఈ అడవిలో తిరుగాడుతూండు!" అని శపించాడు.

వీరేంద్రుడికి వెంటనే రాక్షస రూపం వచ్చేసింది. వాడు నిలువెల్లా వణికిపోతూ చెట్టుదిగివచ్చి, సన్యాసి కాళ్ళపైబడి, "అయ్యా, నేను తెలియక చేసిన తప్పుకు ఇంత ఘోర శాపం యిస్తారా? ఇదేమైనా న్యాయమేనా?" అని అడిగాడు.

ఆ మాటలతో సన్యాసి కొంత శాంతపడి, "నా శాపానికి తిరుగులేదు. అయితే నీకొక విమోచనమార్గం చెబుతాను," అన్నాడు.

"అయ్యా, అదేదో సెలవివ్వండి," అన్నాడు వీరేంద్రుడు.

అప్పుడు సన్యాసి, "నువ్వింకా గృహస్థువు కాని పేదయువకుడివి గదా! నువ్వీ రాక్షస రూపంలో అడవిలో తిరుగుతున్నప్పుడు, ఏ కన్య అయినాసరే తనకు తానుగా యిష్టపడి పెళ్ళాడితే, అప్పుడు నీకీ రాక్షసరూపం పోయి, పూర్వపు మానవరూపంవస్తుంది," అని చెప్పి తన దారిన వెళ్ళిపోయాడు.

కోలార్ కృష్ణ అయ్యర్

వీరేంద్రుడు రాక్షసరూపంలో అడవిలో, కొండప్రాంతాలాతిరుగుతూ సన్యాసిచెప్పిన అవకాశం కోసం ఎదురు చూడసాగాడు.

ఒకరోజున సుగుణసుందరి అనే జమీందారు కూతురు మేనాలో అడవి మార్గాన తన మేనమామగారింటికి వెళు తున్నది. వెంట కొందరు నౌకర్లున్నారు. ఒకచోట దొంగల ముఠా ఒకటి హఠాత్తుగా మేనాను అడ్డగించింది. రక్షణగా వస్తున్న జమీందారు నౌకర్లు దొంగల మీద తిరగ బడ్డారు. అయితే, దొంగలు అధిక సంఖ్యలో వుండడంతో వాళ్ళు దెబ్బలు తిని అక్కణ్ణించి పారిపోయారు.



దొంగల నాయకుడు, సుగుణసుందరి అందచందాలకు ముగ్ధుడై, ఆమెను వివాహమాడదలచి, కొండల్లోని తన గుహకు తీసుకుపోయాడు. జరిగినదంతా చాటున వుండి గమనించిన వీరేంద్రుడు, దొంగల నాయకుణ్ణి అనుసరించిపోయి, రహస్యంగా తానొక గుహలో దాక్కున్నాడు.

దొంగల నాయకుడు, సుగుణసుందరి ఎవరైనదీ తెలుసుకుని, "నేను, నిన్ను వివాహమాడదలిచాను. ధనం విషయంలో నేను, మీ నాన్నగారిని మించినవాణ్ణి. యీ పక్కనున్న గుహలోకి వచ్చిచూడు. అక్కడవున్న వెండి, బంగారాలు రాజుగారి ఖజానాలోనే వుండవు," అన్నాడు.

"ఎంత ధనమున్నా, నువ్వు దొంగవు! తక్షణం గుహనుంచి బయిటికిపో," అన్నది సుగుణసుందరి కోపంగా.

కొద్ది రోజుల తర్వాత అయినా, ఆమె మనసు మార్చుకుని వివాహానికి అంగీ కరిస్తుందన్న ఆశతో, దొంగల నాయకుడు గుహ వదిలి వెళ్ళిపోయాడు.

ఆ సమయంలో వీరేంద్రుడు గుహలో ప్రవేశించి, సుగుణసుందరితో, "నేను రాక్షసుణ్ణని భయపడకు, సుగుణసుందరీ! నిన్ను దొంగలబారినుంచి రక్షించి క్షేమంగా ఇల్లు చేర్చుతాను, నా వెంటరా!" అన్నాడు.

ఆ మాటలకు ఆమె ఆశ్చర్యంతో, "నేనెవరైనదీ, నీకెలాతెలుసు?" అన్నది.

"నేను నిన్నేకాక, మీ నాన్నగారిని కూడా ఎరుగుదును. ఇప్పుడా వివరాలతో పనిలేదు. బయల్దేరు!" అంటూ వీరేంద్రుడు ముందుండి దారితీశాడు.

వాళ్ళు అడవిలో కొంతదూరం వెళ్ళే సరికి, దొంగలనాయకుడు తన అనుచరులతో వచ్చి అడ్డగించి, సుగుణసుందరితో, "ఈ పనికిమాలిన రాక్షసుడా, నిన్ను రక్షించగలిగేది? వీడు వట్టి భీరువు. ఒక్క మనిషినైనా చంపితినగా మేము చూడలేదు. వీడి ఆహారం పళ్ళూ, కందమూలాలూ!" అంటూ వీరేంద్రుడిపై కత్తిదూశాడు.

వీరేంద్రుడు ఒడుపుగా దొంగలనాయకుడి నుంచి కత్తి లాక్కుని, దానితో వాడి గుండెల్లో ఒక్కపోటు పొడిచి, నెత్తురోడుతున్న కత్తితో, వాడి అనుచరులమీదికి వెళ్ళాడు. వాళ్ళు చావుభయంతో హాహాకారాలు చేస్తూ, పారిపోయారు.

సుగుణసుందరి ఇది చూసి అమితాశ్చర్యం చెంది, వీరేంద్రుడితో, "రాక్షసుడివైన నిన్ను చూసి పారిపోవలసిన దొంగలనాయకుడు, నిన్ను అవహేళన చేయడమేకాక కత్తిదూయడం, ఆశ్చర్యం కలిగిస్తున్నది. నిన్ను గూర్చిన రహస్యం వాడికేదో తెలిసి వుండాలి!" అన్నది.

"తెలిసివుండొచ్చు!" అన్నాడు వీరేంద్రుడు విచారంగా తలవంచుకుని.

అప్పుడు సుగుణసుందరి, అతడితో, "మానవుల్లో కూడా అరుదైన దయాగుణం నీలో వున్నది. నీకిష్టమైతే నిన్ను వివాహమాడదలిచాను," అన్నది.

ఆమరుక్షణంవీరేంద్రుడికిరాక్షసరూపం పోయి, మామూలు రూపం వచ్చేసింది.

సుగుణసుందరి ఒకటి, రెండు క్షణాలు నివ్వెరపడి, "ఏమిటిది? నువ్వు నిజంగా రాక్షసుడివి కాదా?" అన్నది.

వీరేంద్రుడామెకు జరిగినదంతా చెప్పి, ఆమె తండ్రి ఇంటికి తీసుకుపోయాడు. జమీందారు కుమార్తె ద్వారా సంగతి తెలుసుకుని, చాలా సంతోషించి, వీరేంద్రుడితో సుగుణసుందరి వివాహం వైభవంగా జరిపించాడు.






## 5

[సుమేధ రాజకుటుంబాన్ని హతమార్చి, రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోవడానికి సేనాధిపతి వీరసింహుడు కుట్రపన్నాడు. రాజు శాంతిదేవుడి ఆజ్ఞప్రకారం, రాణి సొరంగమార్గం గుండా వెళ్ళి అరణ్యమధ్యం చేరుకుని, తమ రెండేళ్ళ కొడుకును, జయానందమునికి అప్పగించి కళ్ళు మూసింది. రాజువీరోచితంగా పోరాడి నదిలోకి దూకేశాడు. —తరవాత]

రాజప్రాసాదం లోపల జరిగిన పోరాటం గురించి, వెలుపల క్రిక్కిరిసి వున్న జనసమూహంలో ఏ ఒక్కరికీ తెలియదు. కొందరు యువరాజు జన్మదినసందర్భంగా ఏర్పాటు చేసిన బాణాసంచా వేడుకలను చూడడంలో లీనమైపోయారు. మరి కొందరు ఆటపాటలను, చూడడంలో తన్మయులైపోయారు. ఇంకా కొందరు అందమైన దీపాలంకరణలనూ, జనసందోహాన్నీ చూస్తూ అటూ ఇటూ తిరగసాగారు.

ఇలా రాత్రి మూడోజామువరకు గడిచిపోయింది. నాలగవజాముకల్లా ఒక్కొక్క కార్యక్రమం పూర్తికావడంతో వేడుకల సందడి తగ్గుముఖం పట్టింది. ఎక్కడ చూసినా కాలిపోయి కింద పడివున్న బాణాసంచాలు చెల్లాచెదరుగా నిర్జీవంగా కనిపించాయి. నటీనటులూ, నర్తకులూ



తమ తమ వేషాలనూ, అలంకరణలనూ తీసి వేయసాగారు. జనం మెల్లగా తమ తమ ఇళ్ళకు చేరుకోసాగారు.

రాజభవనంలో పని చేసేవాళ్ళందరినీ ఒక్కచోట గుమిగూడమని వాళ్ళ అధికారి అజ్ఞాపించాడు. అతడు ఒక ఎత్తయిన వేదిక మీద నిలబడి, "రాజ్యాధికారం ఇప్పుడు శాంతిదేవుడి నుంచి సేనాధిపతి వీరసింహుడి వశమయింది. ఎందుకిలా జరిగిందని మీరెవ్వరూ అడగకూడదు. అది, ఇప్పటి మన రాజుకూ, మునుపటి రాజుకూ సంబంధించినవ్యవహారం. అందువల్ల ఈ విషయంగా మీరెవ్వరూ నోరు కదపకూడదు. ఒకరితో ఒకరు చర్చించుకోకూడదు. ఇది రాజాజ్ఞ. ఇక వెళ్ళి మీమీ పనులు చూడండి," అని ఆజ్ఞాపించాడు.

సేవకులందరూ తలలు వంచుకుని మౌనంగా తమ పనులకు వెళ్ళిపోయారు.

తెల్లవారేలోపల, అధికారమార్పిడి గురించి నగరం నాలుగు మూలలా చాటింపు జరిగింది. చాటింపు చేసే భటులకు రక్షణగా వారి కిరువైపులా ఆయుధాలు ధరించిన సైనికులు వెళ్ళారు. ఎవరైనా అధికారమార్పిడిని నిరసిస్తూ నోరుకదిపితే తలలు ఎగిరిపోతాయని సైనికులు హెచ్చరించారు. ఈ చాటింపు విని నగర పౌరులు దిగ్భ్రాంతి చెందారు. ఒక రచ్చబండవద్ద ఈ చాటింపు వినగానే ఒక వృద్ధుడు, "ఆనందకరమైన తరుణంలో ఎటువంటి దుర్వార్త వినవలిసి వచ్చింది, హతవిధీ!" అని వాపోయాడు.

మరుక్షణమే ఇద్దరు సైనికులు ఆ వృద్ధుడిపైబడి, అతణ్ణి బంధించి అవతలికి లాక్కుపోయారు.

నగరమధ్యంలో ఒకచోట, చాటింపు వినడానికి అసంఖ్యాకంగా ప్రజలు గుమిగూడారు. చాటింపు వినడంతో వాళ్ళపై పిడుగుపడ్డట్టయింది. ఎవ్వరూ నోరు తెరవలేక పోయారు. ప్రజల మధ్య నుంచి ఒక యువకుడు, "రాజుగారు మనస్ఫూర్తిగానే ఈ ఏర్పాటు చేశారా? ఇప్పుడు రాజు

గారూ, రాణీ యువరాజూ ఎక్కడున్నారు?'' అని అడిగాడు.

''అవన్నీ నీకనవసరం!'' అని అరిచాడు చాటింపు వేసిన భటుడు.

''శాంతిదేవ మహారాజు పరిపాలనలో మేము ఏ కొరతా లేకుండా జీవిస్తున్నాము. మా రాజుగారికి సంబంధించిన విషయం కాబట్టి, ఆయన ప్రజలయిన మాకూ సంబంధించినదే. అందుకే అడుగుతున్నాను!'' అన్నాడు యువకుడు.

''అలాగా! అయితే మావెంట రా. చెబుతాము,'' అన్నాడు భటుడు.

''మీ వెంట నేనెందుకు రావాలి? నిన్నటివరకు ఎంతో ఆరోగ్యంతో, ఆనందంతోవున్న రాజుగారు హఠాత్తుగా రాజ్యాధికారాన్ని త్యజించవలసిన కారణం మాకు తెలియాలి!'' అన్నాడా యువకుడు.

దానికి భటుడు ఎటువంటి సమాధానమూ చెప్పలేదు. కాని, చేయెత్తి తన అనుచరులకు సైగచేశాడు. మరుక్షణమే నలుగురు సైనికులు ఆ యువకుడి పైబడి, బంధించి దూరంగా లాక్కుపోయారు. వాళ్ళనుంచి బయటపడడానికి యువకుడు పెనుగులాడాడు. కాని, ప్రయోజనం లేకపోయింది.

ఈ సంఘటనతో, పరమదుర్మార్గుడు రాజ్యసింహాసనాన్ని ఆక్రమించినట్టు



ప్రజలు గ్రహించారు. రాజుకూ, రాజ కుటుంబానికీ ఏమయిందో తెలియలేదని ప్రజలెంతగానో బాధపడ్డారు. కాని, రాజ కుటుంబం గురించి ఎవరైనా నోరెత్తితే చాలు; నానా బాధలకు గురికావలసి వచ్చేది. ఆ కారణంగా రాజధానీనగరాన్ని శ్మశానమౌనం, శోకం ఆవహించాయి!

శాంతిపురంలో జరిగిన ఘోరమైన ద్రోహచర్య గురించిన వార్త రాణీగారి తండ్రి రాజ్యమైన అమృతపురికి అందింది. అయినా, సుమేధతో పోల్చినట్టయితే అమృతపురి సైనికబలం చాలా స్వల్పమైనది. అందువల్ల రాణిగారి తండ్రి ఏమి చేయడమా అని ఆలోచించసాగాడు.



వీరసింహుడు మరునాడు రాజపురోహితుణ్ణి పిలిపించి, తనకు రాజ్యాభిషేకం చేయమని కోరాడు. అందుకు రాజపురోహితుడు, ''మన సంప్రదాయం ప్రకారం, రాజు మరణిస్తేనే, లేదా విశ్రాంతి తీసుకుంటేనే తప్ప, కొత్తరాజుకు రాజ్యాభిషేకం చేయడం సాధ్యం కాదు. పైగా, రాజు లేదా రాజకుటుంబం అభీష్టానుసారమే కొత్తరాజుకు పట్టాభిషేకం జరగాలి. ఈ పరిస్థితిలో శాంతిదేవమహారాజు అనుమతి లేకుండా నేను నిన్నెలా మకుటాభిషిక్తుణ్ణి చేయగలను?'' అని అడిగాడు.

వీరసింహుడు పట్టరాని ఆగ్రహంతో చూశాడు. మరుక్షణమే అతడి భటులు, రాజపురోహితుణ్ణి బంధించి, కారాగారంలోకి తోశారు!

వెంటనే మరొక కొత్త పురోహితుణ్ణి తీసుకువచ్చారు. వీరసింహుడి మకుటాభిషేకం హడావుడిగా జరిగిపోయింది!

శాంతిదేవుడికి ఆప్తులూ, విశ్వాసపాత్రులూ అయిన వారినందరినీ, ఆస్థాన పదవులనుంచి తొలగించి, ఆయాస్థానాలలో తనకు విశ్వాసపాత్రులయినవారిని నియమించాడు వీరసింహుడు.

సభ సమావేశమయిన మొదటి రోజున వీరసింహుడు, వృద్ధమంత్రితో, ''మంత్రివర్యా, రాజ్యం వీరభోజ్యం అన్న సత్యం మీరెరిగినదే. అయితే, శాంతిపురం చాలా కాలం నుంచి విజయయాత్రకు బయలుదేరలేదు. మన సైనికులు సోమరితనానికి అలవాటుపడిపోయారు. సాటిరాజులను జయించడంలోని ఆనందాన్ని అనుభవించలేనివారు రాజులనిచెప్పుకోవడానికే అర్హులు కారు. అందువల్ల మనం ప్రప్రథమంగా ఏ రాజ్యం మీదికి దండెత్తడం ఉత్తమమో తెలియజేయడం, అనుభవజ్ఞులయిన మంత్రిగా మీ కర్తవ్యం!'' అన్నాడు మీసాన్ని గోటితో దువ్వుతూ.

వృద్ధమంత్రి లేచినిలబడి, మెల్లగా దగ్గి, ''సేనాధిపతీ....ఒక్క విషయం....'' అని ఏదో చెప్పబోయేంతలో, వీరసింహుడు



అడ్డుపడి, "నన్ను సేనాధిపతీ, అని సంబోధించడానికి మీకెన్ని గుండెలు! నేను నిన్నటివరకు సేనాధిపతినే; కాదనను. కాని ఈ రోజు ఈ సుసంపన్న శాంతిపురానికి తిరుగులేని రాజును! ఇకపై నన్ను సేనాధిపతీ అని పిలవడం మానుకోవడం శ్రేయస్కరం!" అంటూ, తన ఎడమచెవి తెగిన సంగతి సభికుల కంటపడకుండా, కిరీటాన్ని సర్దుకున్నాడు.

"చిత్తం! అయితే, పొరుగురాజ్యాల మీదికి దండెత్తడంకన్నా మన రాజ్యంలోని ప్రజల సుఖశాంతులకోసం కృషి చేయడం పాలకుల ప్రధానకర్తవ్యం అని నా అభిప్రాయం," అన్నాడు మంత్రి.

"మీ అభిప్రాయం ఏదైనా కానీయండి, ఫరవాలేదు. తుది నిర్ణయం మేమే తీసుకుంటాం. అయితే తమరు రాజునైన నన్ను 'మహాప్రభూ' అని సంబోధించలేదన్న విషయం గుర్తించడం అవసరం," అన్నాడు వీరసింహుడు కోపంగా.

"నేను వృద్ధుణ్ణయిపోయాను. పాత అలవాట్లు మార్చుకోవడం అంత సులభం కాదు కాబట్టి సెలవిప్పించారంటే మంత్రి బాధ్యత నుంచి వైదొలగి విశ్రాంతి తీసుకుంటాను,' అన్నాడు మంత్రి.

"మంత్రి పదవి నుంచే కాదు; మేము తలిచామంటే మీకు జీవితం నుంచే విశ్రాంతి ఇవ్వగలం మహామంత్రీ!" అని అరిచాడు వీరసింహుడు ఆగ్రహంగా.

మంత్రి మరేమీ మాట్లాడలేదు. నీ ఇష్ట ప్రకారమే కానివ్వు అన్నట్టు చేతులెత్తి సైగచేశాడు.

"ఈ క్షణమే నిన్ను మంత్రిపదవి నుంచి తొలగిస్తున్నాను," అన్నాడు వీరసింహుడు.

మంత్రి చేతులు జోడించి సభకు నమస్కరించి, మౌనంగా బయటకు వెళ్ళిపోయాడు. వెళుతూన్న మంత్రిని చూసి, వీరసింహుడు పరిహాసంగా నవ్వాడు. ఆ తరవాత అతని అనుచరులందరూ సభ మారుమోగేలా పకపకా నవ్వారు!

వృద్ధమంత్రి ఆ రోజు సాయంకాలం, యథాప్రకారం నగరం శివార్లలో వున్న శివాలయానికి వెళ్ళి దైవదర్శనం చేసుకుని వస్తున్నాడు. సూర్యాస్తమయమై అప్పు డప్పుడే చీకటి అలముకుంటున్నది. ఇరు వైపులా చెట్లూ, దట్టమైన పొదలూగల బాటలో మంత్రి నడుస్తున్నాడు. ఒక పొద చాటునుంచి హఠాత్తుగా ముగ్గురు భటులు ముందుకు దూకారు. ఒక భటుడు మంత్రి చేతులు పట్టుకున్నాడు. రెండవవాడు, మంత్రి అరవకుండా ఆయన నోటిని చేత్తో బలంగా మూశాడు. మూడవవాడు దారి చూపగా, ఇద్దరూ కలిసి మంత్రిని నిర్మా నుష్యమైన ప్రదేశానికి బరబరా లాక్కు పోసాగారు.

వాళ్ళ పట్టునుంచి తప్పించుకునే శక్తి మంత్రికి లేదు. అందువల్ల ఏం జరుగు తుందో జరగనీ అని, ఆయన దేవుడిపై భారం వేసి ఊరుకున్నాడు. మూడవ భటుడి చేతిలోకత్తి తళుక్కున మెరి సింది. వాడు కత్తిని మంత్రి మెడకు గురి పెట్టి పైకెత్తాడు. కాని, మరుక్షణమే వాడి చేతిలోని కత్తి ఎగిరి, దూరంగా వున్న ఒక బండపై బడి ఖంగున మోగింది. వాడు బాధగా మూలుగుతూ వెనక్కు తిరిగి చూశాడు. మిగిలిన ఇద్దరు భటులూ, మంత్రిని వదిలిపెట్టి, ఏం జరిగిందో తెలుసుకోవడానికి చుట్టుపక్కల కలయ జూశారు. కాని అందుకు అవకాశమే లేకుండా, క్షణంలో ఒక కత్తి వేటుకు ముగ్గురి తలలూ ఎగిరి దూరంగా పడ్డాయి!

మెరుపులాంటి ఖడ్గచాలనంతో ముగ్గు రినీ హతమార్చిన మర్మవీరుడు మంత్రితో, "రేపు తెల్లవారేవరకూ, ఈ హంతకుల మరణం గురించి ఎవరూ తెలుసుకోలేరు. రాత్రికిరాత్రే నువ్వు ఈ రాజ్యం వదిలి వెళ్ళి అమృతపురి చేరుకో!" అన్నాడు.

"మీరు...." అని వృద్ధమంత్రి కృతజ్ఞ తతో ఇంకేదో అనబోయాడు.

"మరేమీ మాట్లాడకు!" అని హెచ్చ రించి, మర్మవీరుడు మరుక్షణమే చీకటిలో కలిసిపోయాడు. —(ఇంకావుంది)





# ఇరుగు పొరుగు

భూషయ్య పెద్ద ఆస్తిపరుడేగాని, చాలా పిసినిగొట్టు. గ్రామస్థులెవరైనా ధర్మ కార్యాలకని, ఆయన దగ్గిరకు చందా కోసం వస్తే, "ధర్మకార్యాలకంటూ నేను చందాలివ్వడం మొదలుపెడితే, త్వరలోనే దివాళా ఎత్తిపోతాను. బడీ, గుడీ అంటూ నన్ను వేధించకండి. వాటితోపాటు బావులు తవ్వించడం, రహదార్లు బాగు చేయించడం లాంటివి కూడా ప్రభుత్వమే చేయాలి. వెళ్ళి, అధికారులను ఒత్తిడి చేసి పనులు జరిపించుకోండి," అనే వాడు ఏమాత్రం మొహమాటపడకుండా.

భర్త ధోరణి నచ్చకపోయినా, అతడి తత్వం బాగా ఎరిగివున్నందున, భూషయ్య భార్య లక్ష్మమ్మ అంతా చూస్తూ మౌనం వహించేది.

భూషయ్య ఇంటిపొరుగునే, రామయ్య అనే రైతుండేవాడు. అతడెక్కడి నుంచో ఒక కొత్తరకం మామిడిమొక్క తెచ్చి పెరట్లో నాటాడు. అది క్రమంగా పెరిగి పెద్దదై కాయలు కాయసాగింది. వాటిని గురించి గ్రామంలో వింతగా చెప్పుకో సాగారు.

పొరుగింటి పెరట్లో కంటికింపుగా కనిపిస్తున్న మామిడిపండ్లను చూస్తూంటే, భూషయ్యకు నోరూరుతూండేది. రామయ్య కొన్ని పండ్లను పంపిస్తాడన్న ఆశతో, భూషయ్య ఎదురుచూడసాగాడు. అయితే, రామయ్య, భూషయ్యకే కాదు, గ్రామంలో ఎవరికీ కూడా ఒక్క పండయినా యివ్వ లేదు.

ఈ స్థితిలో, ఒక రాత్రివేళ, భూషయ్య పదమూడేళ్ళ కొడుకు గురునాథం, రహస్యంగా పెరటి గోడదూకి, పళ్ళు కోసుకుని ఇంట్లోకి వస్తూ, తల్లి లక్ష్మమ్మకు ఎదురుపడ్డాడు.

తిరుమలశ్రీ

లక్ష్మమ్మ వాణ్ణి పట్టుకుని, ''వెధవా, ఇదేం పాడుపనిరా?'' అని అడిగింది.

అందుకు గురునాథం, ''అమ్మా, ఇదేం పాడుపని కాదు. ఈ చుట్టుపక్కల ఎక్కడా దొరకని ఇంత మంచి మామిడిపళ్ళు, చెట్టుకు విరగ్గాసినా, రామయ్య ఎవరికీ ఒక్క పండయినా యివ్వలేదు. ఆయన వట్టి పిసినిగొట్టు. ఈ పళ్ళు తినాలని, నాన్నకూ నోరూరుతున్నది. ఆ సంగతి నాకు తెలుసు!'' అన్నాడు బింకంగా.

పక్క గదిలో వున్న భూషయ్య, కొడుకు జవాబుకు చాలా సంతోషించాడు. కానీ లక్ష్మమ్మ కోపంగా, ''పొరుగింటి రామయ్య, తనకున్నదానిలో కొంతయినా ఇతర్లకు యివ్వడం లేదని, నీకు అక్కసుగా వున్నదన్నమాట! మీ నాన్న ఆ పండ్లకేసి చూసేచూపు, నేను గమనిస్తూనే వున్నాను. తనకు పుష్కలంగా వున్నదాన్ని, ఇతరులతో పంచుకోకపోవడం స్వార్థం, పిసినారితనం అవుతుందని, నాకు తెలుసు,'' అన్నది.

''మరయితే, నా మీద ఎందుకు కోపం తెచ్చుకున్నావు?'' అని అడిగాడు గురునాథం.

''ఎందుకా? నువ్వు రామయ్యనయితే తప్పుపట్టగలిగావుగాని, మీ నాన్న సంగతేమిటి? మన గ్రామంలో బడిగానీ, బాటసారులకుపయోగించే సత్రం గానీ లేవు. మనం ఏమీలేని పేదలం కాదు; బాగా వున్నవాళ్ళమే. అయినా పది



మందికీ మేలుకలిగే పనుల్లో, మీ నాన్న చందాలిచ్చి సాయం చేస్తున్నాడా ?'' అన్నది లక్ష్మమ్మ.

గురునాథం ఏదో అనబోయేంతలో, భూషయ్య గదినుంచి బయిటికివచ్చి, ''వాడిది చిన్నతనం. కొత్తరకం మామిడి పళ్ళు తినాలన్న ఆశకొద్దీ కోసుకొచ్చాడు. అదేదో పెద్ద దొంగతనమన్నట్టు, వాణ్ణి చివాట్లు పెట్టకు,'' అన్నాడు.

ఆ మాటలకు లక్ష్మమ్మ చిన్నగా నవ్వి, ''ఆశకొద్దీ ఇతర్లసొత్తును చేజిక్కించుకోవటం దొంగతనం అనిపించుకోదా ? మన దగ్గిరున్న సొమ్మును ఆశకొద్దో, అవసరం కలిగో ఎవరైనా దోపిడీచేస్తే, దాన్నేమని పిలవాలి ?'' అని అడిగింది.

భూషయ్య ఆ ప్రశ్న విని వెలవెల పోయి, ''మామిడికాయలు దొంగిలించుకు వచ్చిన బాబును, నువ్వన్న మాటలన్నీ నేను విన్నాను,'' అన్నాడు.

''ఇందాక మన గురునాథం చేసింది దొంగతనం కాదన్నారు గదా? మరి ఇంతలోనే అది దొంగతనం ఎలా అయి పోయింది,'' అన్నది లక్ష్మమ్మ.

''నువ్వన్న మాటలు, అంతగా లోక జ్ఞానం లేని బాబులో ఎలాంటి మార్పు కలిగించాయో, నాకు తెలియదు. నేను మాత్రం పూర్తిగా మారిపోయాను. ఆ సంగతి రేపటినుంచే రుజువు చేస్తాను !'' అన్నాడు భూషయ్య.

ఆ మర్నాడే అతను గ్రామముఖ్యులను కలుసుకుని, గ్రామంలో ప్రజోపయోగమైన పనులు జరిపించేందుకు కొంత ధనం యిచ్చాడు.

భూషయ్యలో వచ్చిన మార్పుకు, గ్రామస్థులంతా సంతోషించారు. రామయ్య తన పెరట్లో కాసిన మామిడిపండ్లను స్వయంగా తీసుకుపోయి భూషయ్యకిచ్చి, "భూషయ్యా, మనం ఇరుగుపొరుగు ఇంటి వాళ్ళమన్న సంగతి, యీనాటివరకూ గుర్తుకు రాలేదు సుమా !'' అన్నాడు.

ఆ మాటకు భూషయ్యతోపాటు, లక్ష్మమ్మ కూడా తృప్తిగా నవ్వింది.






# దివ్యశక్తుల పరీక్ష

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఒక దేశపాలకుడుగా, నీకున్న కీర్తి ప్రతిష్ఠ లేమిటో నాకు తెలియవు. రాజైనవాడికి ధర్మగుణం, పరాక్రమం, తెలివితేటలూ వున్నంతమాత్రాన చాలదు. వాటికి తోడు సూక్ష్మబుద్ధీ, మనోస్థైర్యం అవసరం. ఆ రెండూ నీలో లోపించిన కారణంగానే, ఈ అర్ధరాత్రి వేళ ఏదో అసాధ్యమైన కార్యాన్ని సాధించబూని, ఈ శ్మశానంలో తిరుగుతున్నావని, నాకు అనుమానం కలుగుతున్నది. రాజు మాధవసేనుడిలాగా, కొందరు తాము చేయని నేరానికీ, పాపానికీ తమకుతామే శిక్ష విధించుకుంటారు. ఇందుకు కారణం సూక్ష్మ

## బేతాళ కథలు



బుద్ధీ, మనోస్థైర్యం లేకపోవడం. నీకు శ్రమ తెలియకుండా వుండేందుకు అతడి కథ చెబుతాను, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొకప్పుడు కోసలదేశాన్ని, మాధవ సేనుడనే రాజు పరిపాలించేవాడు. అయన ప్రజలను కన్నబిడ్డల్లా చూసుకునే వాడు. ప్రజాక్షేమాన్ని కాంక్షించడంలో, ముల్లోకాలలోనూ ఆయనకు ఆయనే సాటి అని పేరు వచ్చింది.

ఇలా వుండగా—కోసలదేశంలో అగ్ని నేత్రుడనే మాంత్రికుడు ప్రవేశించాడు. వాడు క్షుద్రవిద్యలతో సామాన్య పౌరులను భయపెట్టి, తన పనులు చక్కబెట్టుకో సాగాడు. ఆవిధంగా వాడొక పెద్ద భవనం నిర్మించుకుని, సకలసదుపాయాలతో సుఖంగా జీవిస్తూ ప్రజలను వేధించ సాగాడు. ప్రజలకు వాడంటే విపరీతమైన భయం. అందుచేత, ఎవరూ వాడిని గురించి రాజుకు ఫిర్యాదు చేయలేదు.

చారుల ద్వారా మాధవసేనుడికి, అగ్ని నేత్రుణ్ణి గురించి తెలిసింది. ఆయన వెంటనే కబురు పంపి వాణ్ణి కొలువుకు రప్పించాడు.

అగ్నినేత్రుడు, మాధవసేనుడికి సవినయంగా నమస్కరించి, ''నీ రాజ్యంలో ప్రజలూ, నేను కూడా ఎంతో సుఖంగా జీవిస్తున్నాం. నీకు నా వందనాలు,'' అన్నాడు.

మాధవసేనుడు శాంతంగా, ''నీ వినయం నాకు సంతోషాన్ని కలిగించింది. నువ్వు వెంటనే, నా రాజ్యం వదిలి వెళ్ళి పోతే నేనింకా సంతోషిస్తాను,'' అన్నాడు.

"నావంటి మహామాంత్రికుడు ఏదేశంలో వుంటే, ఆ దేశానికి ఎంతో గౌరవం. నన్ను నీవు పొమ్మనడానికి కారణం ఏమిటి?'' అని అడిగాడు అగ్నినేత్రుడు.

''నీ బుద్ధి మంచిదికాదు. నువ్వు స్వార్థపరుడివి. నా రాజ్యంలో నీవంటి వారికి స్థానం లేదు. నువ్వు నీ దుష్టశక్తులతో సామాన్యులను బాధించి, వేధించి

సుఖాలనుభవిస్తున్నావు.'' అన్నాడు మాధవసేనుడు.

దీనికి బదులుగా అగ్నినేత్రుడు పెద్దగా నవ్వి, ''శక్తిమంతుడు, శక్తిహీనుడి కంటె ఎక్కువ సుఖపడడం ఏ దేశంలోనైనా జరిగేదే! నువ్వు విధించే పన్నులు ప్రజలు సంతోషంగా చెల్లిస్తున్నారంటావా? నీ శాసనాలన్నీ వాళ్ళకు నచ్చుతున్నాయంటావా? ప్రజలు నా మీద ఫిర్యాదు చేయడం లేదు కాబట్టి, నేనూ మంచి వాణ్ణే! ఇక స్వార్థం మాటంటావా? ప్రజల కంటె ఎక్కువ వైభవంగా జీవిస్తూ సుఖపడుతున్న నువ్వుమాత్రం, స్వార్థపరుడివి కాదా? అందుకని నువ్వు దేశం వదిలి పోతావా?'' అని ప్రశ్నించాడు.

''రాజు రాజభవనాల్లో నివసించడంలో సంప్రదాయం తప్ప, ఎక్కువ సుఖం లేదు. నేను స్వార్థపరుడినని నువ్వు ఋజువుచేస్తే, నేను ఈ క్షణమే రాజ్యం వదిలిపోతాను!'' అన్నాడు మాధవసేనుడు.

అగ్నినేత్రుడు వికటాట్టహాసం చేసి, ''నీతో నాకు వాదనలేమిటి? అకారణంగా నన్ను రాజ్యం వదలిపొమ్మన్నావు. నేను నీ కుమార్తెను, నాతో తీసుకుపోతాను. ఏం చేయగలవో చేయి.'' అంటూ అక్కణ్ణించి మాయమయ్యాడు.



అంతే! అదే సమయంలో మాధవసేనుడి ఏకైకపుత్రిక మాధవీలత, అంతఃపురం నుంచి మాయమయ్యింది.

మహారాజు మాధవసేనుడికి ఏం చేయాలో పాలుబోలేదు. అప్పుడు మంత్రి ఆయనతో, ''ప్రభూ, మాధవీలతకు తగిన వరుణ్ణి ఎన్నిక చేయాలనుకుంటున్నారు కదా! ఇప్పుడు దీన్నొక అవకాశంగా తీసుకుందాం. ఏ వీరుడు మాంత్రికుణ్ణి చంపి రాజకుమారిని రక్షిస్తాడో, ఆ వీరుడికి మీరు రాజ్యాన్నీ, యువరాణినీ కూడా సమర్పించవచ్చు.'' అన్నాడు.

మాధవసేనుడు చేసేదిలేక ఇందుకు అంగీకరించాడు. వెంటనే రాజ్యంలో,

ఆ విధంగా చాటింపు వేయబడింది. రాజకుమార్తెనూ, రాజ్యాన్నీ తమదిగా చేసుకోవాలని ఎందరో యువకులు ఉత్సాహంగా బయల్దేరారు.

ఈలోగా మాధవసేనుడు కూడా ఊరుకోలేదు. ఆయన అంతఃపుర భూగృహంలోని మహాదేవి ఆలయానికి వెళ్ళి, "పరాక్రమంతో దుష్టుల నెదిరించగలను. దుష్టశక్తుల నెదిరించడానికి నా శక్తి చాలదు. నువ్వే సాయపడాలి," అని దేవిని ప్రార్థించాడు.

అప్పుడు దేవి ప్రత్యక్షమై, "రాజా, నిన్ను కొన్ని దివ్యశక్తులు పరీక్షకు గురిచేస్తున్నాయి. దిగులుపడకు. నేను నీకొక ఖడ్గాన్ని యిస్తున్నాను. అది తాకగానే దుష్టశక్తి ఎంత బలమైనదైనా బూడిదగా మారిపోతుంది," అని ఒక ఖడ్గాన్ని ఆయన కిచ్చి మాయమయింది.

మాధవసేనుడు ఆ ఖడ్గాన్ని ఒరలో వుంచుకుని, ఆ రాత్రికి సుఖంగా నిద్రపోయాడు. అలా వారం రోజులు గడిచేసరికి, ఒక రోజున మాధవీలత అపూర్వ తేజంతో విరాజిల్లే అందమైన యువకుడితో తిరిగి వచ్చింది.

ఆ యువకుడు మాధవసేనుడికి వంగి నమస్కరించి, "నేను అగ్నినేత్రుణ్ణి చంపి మాధవీలతను రక్షించి తీసుకువచ్చాను. నా పేరు అగ్నిసేనుడు. మా పూర్వీకులు విదేహరాజ్యాన్నేలారని చెప్పుకుంటారు," అని తనను గురించి చెప్పుకున్నాడు.



మాధవసేనుడు మారుమాట్లాడకుండా, తన ఒరలోంచి కత్తి దూసి, అగ్నిసేనుణ్ణి తీవ్రంగా తాకాడు. ఆయన యీ విపరీత ప్రవర్తనకు చుట్టూ వున్నవారు మాధవీలతతోసహా ఆశ్చర్యపోయారు. అగ్నిసేనుడికి రవంత గాయం కూడా కాలేదు. అతడు నవ్వుతూ నిలబడ్డాడు.

మాధవసేనుడు మారుమాట్లాడకుండా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. అగ్నిసేనుడికీ, మాధవీలతకూ వివాహం జరిగింది.

వివాహానంతరం అగ్నిసేనుడికి రాజ్యాభిషేకం జరిగింది. అప్పుడు అగ్నిసేనుడి రూపం వున్నట్లుండి అగ్నినేత్ర మాంత్రికుడిగా మారిపోయింది. వాడు నవ్వుతూ, "యువరాణిని నేను వివాహ మాడాలనుకున్నాను. ఈ దేశానికి రాజును కావాలని కలకన్నాను. ఈ రెండు కోర్కెలూ తీర్చుకునేందుకు, నా శక్తుల్ని ఉపయోగించుకున్నాను. ముందు మాధవీలతను అపహరించాను. తర్వాత నేనే ఆమెను మీకు సమర్పించాను," అన్నాడు.

మాధవసేనుడు కొంచెంసేపు ఆలోచిస్తూ వూరుకుని, "అగ్నిసేనా, నువ్వు మామూలు క్షత్రియ యువకుడివి. నన్ను పరీక్షించడానికి, ఏవో దివ్యశక్తులు నిన్ను ఉపయోగించుకున్నాయి. మాంత్రిక వేషంతో ఎవరినీ భయపెట్టకు. కోసలకు ప్రభువుగా చక్కని రాజ్యపాలన చెయ్యి. ఈ పరీక్షలో నేనోడిపోయాను. పాప



పరిహారార్థం నేను కొంతకాలం వనవాసానికి వెళ్ళి, తపస్సు చేసుకుని వస్తాను,'' అని అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఆ మరుక్షణం మాంత్రికుడు అగ్ని నేత్రుడి రూపంలో వున్నవాడికి, ఆ రూపం పోయి అగ్నిసేనుడుగా మారిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, మాధవసేనుడు తాను పాపం చేశానంటూ వనవాసానికి పోవడం, అర్థం లేని పని కాదా? అతడు ప్రజల్ని కన్నబిడ్డల్లా పాలించాడు. వాళ్ళకు మరొక మంచి ప్రభువు నిచ్చాడు. ఇన్నిచేసి అతడు పాప పరిహారం, తపస్సూ అనడం, బుద్ధి లోపం, మనోస్థైర్యం కోల్పోవడంవల్లనే కదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''మాధవ సేనుడు తాను పాపం చేశాననడం, నువ్వు చెప్పిన కారణాలవల్ల కాదు. అతడు పాపం చేసినమాట నిజం. రాజ్యం అతడి బాధ్యత తప్పితే సొంత ఆస్తి మాత్రం కాదు. సమర్థులకు మాత్రమే దాన్ని అతడు అప్పగించాలి. అసమర్థుడికో, దుష్టుడికో అప్పగిస్తే, అందువల్ల ప్రజలు కష్టనష్టాలకు గురవుతారు. ఇవన్నీ ఆలోచించక కన్నకూతురిపై మమకారంతో, స్వార్థబుద్ధితో ఎవరు తన కుమార్తెను రక్షిస్తే వారికి రాజ్యం కట్టబెడతాననడం, మాధవసేనుడు చేసిన మొదటి పాపం. కులదేవత అద్భుతశక్తులుగల ఖడ్గాన్నిచ్చి, దివ్యశక్తులు కొన్ని నిన్ను పరీక్షకు గురి చేస్తున్నవని అతణ్ణి హెచ్చరించింది. అయినా, మాధవసేనుడు ఆ హెచ్చరికను తోసిపుచ్చి, అగ్నిసేనుడి మీద ఖడ్గాన్ని ప్రయోగించాడు. ఇది రెండవ పాపం. ఇవన్నీ గుర్తించే అతడు వనవాసానికి పోవడం జరిగింది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: ''వసుంధర'' రచన]



# చందమామ అనుబంధం—15

## మన విజ్ఞాన సంపద

### ఎవరాయన?

తూర్పు సముద్ర తీరంలో కనుచూపు మేరకు ఇసుక. దరిదాపుల్లో చిన్న పల్లె కూడా కనిపించడం లేదు. ఒకరాజు కొందరు అంగరక్షకులు వెంటరాగా, సముద్ర తీరంలో గుర్రంపై స్వారీ చేస్తున్నాడు. రాజు ఎక్కిన గుర్రం కాలి గిట్టకు హఠాత్తుగా ఏదో బలంగా తగిలి నిప్పు రవ్వ పుట్టింది. ఇసుకనుంచి నిప్పు రవ్వ ఎలా పుడుతుంది! రాజు అమితాశ్చర్యంతో గుర్రం పగ్గాలను లాగి పట్టి కిందికి వంగి చూశాడు. నిప్పు రవ్వ పుట్టినచోట అందంగా మలిచిన రాయి కనబడింది. రాజు ఎంతో ఆసక్తితో, తన అంగరక్షకులను అక్కడ తవ్వమని ఆజ్ఞాపించాడు. ఇసుకలో ఆలయ శిఖర భాగం కనిపించింది. వెంటనే రాజు చుట్టుపక్కలనుంచి మనుషులను రప్పించి తవ్వకం పని ప్రారంభించమన్నాడు. చాలాకాలం తవ్వాక అడుగునుంచి బ్రహ్మాండమైన దేవాలయం ఒకటి బయటపడింది. ఎప్పుడో నిర్మించబడి, కారణాంతరాల వల్ల ఇసుక పడి మూసుకుపోయి భూగర్భం చేరిన బ్రహ్మాండమైన దేవాలయం ఇప్పుడు బయటపడింది!

ఈ ఉదంతంలోని దేవాలయాన్ని కనుగొన్న రాజు పేరేమిటి? ఆలయం ఏది?

(36 వ పేజీ చూడండి)

### మీకు తెలుసా?

1. ఒక గోపురాన్ని కదిలిస్తే పక్కగోపురం కావంతట 'కదిలేగోపురాలు' ఎక్కడ వున్నవి?
2. 'తటాకాలనగరం'గా పేరుగాంచిన భారతీయ నగరం ఏది?
3. బంగాళాఖాతానికీ, అరేబియా సముద్రానికీ మధ్యవున్న జలసంధి పేరేమిటి?
4. ఈ జలసంధిలో వున్న సుప్రసిద్ధ ద్వీపం ఏది?
5. ఆ ద్వీపం ప్రసిద్ధి కావడానికి కారణం అయిన దేవాలయం ఏది?
6. ఈ ఆలయం ప్రత్యేకత ఏమిటి?

(36 వ పేజీ చూడండి)

# అవంతి - ఉజ్జయిని

మహాభారత యుద్ధం జరిగిన కాలానికి పూర్వమే ప్రసిద్ధి గాంచిన రాజ్యం అవంతి. దీనినే అవంతిక అని కూడా అనేవారు. అవంతి ఒకప్పుడు రెండు రాజ్యాలుగా విభజింపబడి వుండేది. దక్షిణ అవంతికి రాజధాని మాహిష్మతీ నగరం. అది ఈనాడు మాంధాతగా పిలువబడుతున్నది. ఉత్తర అవంతికి రాజధాని






రేబిట్, టెడీ, జంబో, బౌ వౌ, ఫాదర్ హేర్—ఈ అయిదూ చందమామ నుంచి మీ ఇంటికి వచ్చే మొదటి చిలిపి బొమ్మలు. విశేషమేమంటే ఇవి నరాసరి మీ గుమ్మంలోకే వచ్చేస్తాయి. మీకు ఇష్టమైన బొమ్మలేవో మాకు రాస్తే చాలు. ఒక నెలలోగా మా అందాల బొమ్మలతో పోస్టమేన్ మీ తలుపు తడతాడు. ఇది అరంభం మాత్రమే. మిమ్మల్ని సంభ్రమాశ్చర్యాలతో ముంచెత్తే అందాల బొమ్మలు మునుముందు చందమామ నుంచి చాలా రానున్నవి!

# ఐదు చిన్నారి చిలిపి బొమ్మలు మీ ఇంట్లోకి రావాలంటున్నాయి!

సానం. అందుకే మీకోసం ఒక ప్రత్యేక కానుకను ఏర్పాటు చేశాం.
ుదట పొందే అవకాశం కూడా మీకే వుంటుంది. మీరు ఆశించే
త్యేకరాయితీ వుంటుంది. మీరు పొదుపుచేయడానికి ఇంకొక మార్గం
కలు ఆర్డర్ చేయడం ద్వారా చందమామ చందాలలో రాయితీ పొంద
6 రూపాయలు తగ్గింపు! 24 సంచికలకు 15 రూపాయలు తగ్గింపు!









ప్రియమైన చందమామకు,
మీ 'మెయిల్-ఎ-టాయ్' పథకం గురించి చదివాను. బొమ్మల జాబితాను పరిశీలించాను.
దయచేసి వీటిని పంపండి (అవసరమైన వాటిపక్కన ✓ చేయండి).

* రేబిట్ * టెడి * జంబో * బౌ వౌ * ఫాదర్ హేర్

చందమామ చందాదారుగా చేరాలంటే దీనిద్వారా ప్రత్యేక తగ్గింపును కూడా పొందవచ్చని తెలిసింది.
నేను చందమామకు చందా పంపుతున్నాను :

* ఒక సంవత్సరం (36 రూపాయలకు బదులు 30 రూపాయలు)
* రెండు సంవత్సరాలు (72 రూపాయలకు బదులు 57 రూపాయలు)
* క్షమించండి. చందా తగ్గింపుపట్ల ఆసక్తి లేదు.

దీనితోపాటు, చందమామ టాయ్‌ట్రానిక్స్ (ప్రై) లిమిటెడ్ పేరు మీదుగా తీసిన రూ.........పోస్టల్ ఆర్డర్/మనిఆర్డర్ పంపుతున్నాను.






ఒక నెలలోగా బొమ్మ(లు) అందగలద(వ)ని ఆశిస్తున్నాను. ఒకవేళ బొమ్మలు నచ్చకపోతే వాటిని ఒక వారంలోగా తిప్పి పంపితే, ధర పైకాన్ని తిరిగి పొందవచ్చని గ్రహించాను.

నా పేరు: ______________ పుట్టిన తేదీ: ______________

చిరునామా: ______________

______________

నా అభిమాన విషయం: ______________

పత్రికలు/కామిక్స్: ______________

టి. వి. కార్యక్రమాలు: ______________ బొమ్మలు ______________

వినోదాలు ________: చదవడం/బొమ్మలు/ఆటలు/టీవీ/వీడియో/వీడియో గేమ్స్/ఇంకేమయినా వుంటే రాయండి



మీరు చేయవలసిందల్లా, ఇక్కడి కూపన్‌ను పూర్తిచేసి, మాకు—
చందమామ టాయ్ ట్రానిక్స్ (ప్రై) లిమిటెడ్, చందమామ బిల్డింగ్స్,
**188, ఎస్. ఎస్. కె. సాలై, వడపళని, మద్రాసు—600 026**
చిరునామాకు పంపడం మాత్రమే. ఈ కూపన్ మాకు చేరిన ఒకనెల లోగా మీకు మా బొమ్మలు అందుతాయి. ఒకవేళ మీకు ఆ బొమ్మలు సంపూర్ణతృప్తిని కలిగించలేదంటే, ఒక వారం లోగా వాటిని మాకు పంపినట్టయితే, ధర మొత్తాన్ని మీకు తిప్పి పంపగలమని హామీ ఇస్తున్నాము.







**చందమామ టాయ్‌ట్రానిక్స్ (ప్రై) లిమిటెడ్**
'చందమామ బిల్డింగ్స్'
**188, ఎస్. ఎస్. కె. సాలై, వడపళని, మద్రాసు – 600 026**

Mudra:M:CT:3789

ఉజ్జయినీ నగరం. ఈ నగరం అదే పేరుతో ఇవాళ మధ్యప్రదేశ్ రాష్ట్రం, మాళ్వలో వుంటున్నది.

రెండువేలా ఐదువందల సంవత్సరాలకు పూర్వం భారతదేశం పదహారు ప్రాంతాలు (షోడశజనపదాలు)గా విభజించబడినట్టు ప్రాచీన బౌద్ధ వాఙ్మయం పేర్కొంటున్నది. ఆ పదహారు ప్రాంతాలలో అవంతి ఒకటి.

ఉజ్జయిని అతి ప్రాచీన నగరం మాత్రమే కాదు; అది మన దేశంలోని ఏడు పవిత్ర నగరాలలో ఒకటి!

సుప్రసిద్ధుడైన విక్రమాదిత్యుడు ఉజ్జయినీ రాజధానిగానే తన పరిపాలన సాగించాడు. ఆయన ఆస్థానంలోనే నవరత్నాలని పేరుగాంచిన కాళిదాసాది కవులు వుండేవారు. మహాకవి కాళిదాసు తన 'మేఘదూతం' కావ్యంలో ఉజ్జయినీ నగరసౌందర్యాన్నీ, క్షిప్రా నది అందాన్నీ అద్భుతంగా వర్ణించాడు. నగరంలో 'మహాకాల' శివాలయాన్ని కూడా ఆయన ఆ కావ్యంలో వర్ణించాడు.

అశోకచక్రవర్తి మౌర్యసింహాసనాన్ని అధిష్ఠించడానికి పూర్వం, మౌర్య వంశ ప్రతినిధిగా ఆయన ఉజ్జయినీ నగరంలో అధికారం చెలాయించాడు.

ఈనాడు ఇక్కడ, పన్నెండేళ్ళకొకసారి కుంభమేళా ఉత్సవాలు బ్రహ్మాండంగా జరుగుతాయి.

# చందమామ కబుర్లు




## సంస్కృతం పట్ల ఆసక్తి

మన ప్రాచీన భాష సంస్కృతం పట్ల ఇటీవల ప్రపంచ వ్యాప్తంగా విజ్ఞులు సరికొత్త ఆసక్తిని కనబరుస్తున్నారు. అమెరికాకు చెందిన వ్యాస్ హోస్టన్, డేవిడ్ లావిన్ కలిసి, సంస్కృతం నేర్పడానికి ఒక కంప్యూటర్ ప్రోగ్రామ్‌ను రూపొందించారు. దీని ద్వారా పాశ్చాత్యులు సైతం, సంస్కృత పదాలను సక్రమంగా ఉచ్చరించడానికీ, చదవడానికీ 20 గం॥లలో సులభంగా నేర్చుకోవడం సాధ్యమవుతుంది!

## షేక్స్‌పియర్ నాటకశాల

షేక్స్‌పియర్ అభిమానులు లండన్ వెళ్ళినప్పుడు, అక్కడ షేక్స్‌పియర్ నాటకాలు ప్రదర్శింపబడిన గ్లోబ్ థియేటర్‌ను చూడాలనుకోవడం సహజమే. అయితే, అది ఇప్పుడు ఎక్కడున్నది? అది ఎప్పుడో కనుమరుగైపోయింది. 1613 వ సం॥ నాటకం (ఎనిమిదవ హెన్రీ) ప్రదర్శింపబడుతున్నప్పుడు ఆ నాటకశాలకు నిప్పంటుకున్నది. అది మళ్ళీ నిర్మించబడింది. కాని, 1616 వ సం॥ షేక్స్‌పియర్ కాలధర్మం చెందడంతో అది ఆకర్షణను కోల్పోయింది. థేమ్స్ నదీతీరంలో, కార్ పార్క్ కింద పూడ్చుకుపోయిన గ్లోబ్ థియేటర్ శిథిలాలను ఇటీవలే కనుగొన్నారు. మునుముందు అది పలువురి దృష్టిని ఆకర్షించగలదు!



# సాహిత్యావలోకనం

1. సుప్రసిద్ధ రచయిత మాక్సింగోర్కీ అసలు పేరేమిటి ?

2. ప్రముఖ రచయిత జార్జ్ ఆర్వెల్ అసలు పేరేమిటి ?

3. ప్రసిద్ధ రచయిత సాకి అసలు పేరేమిటి ?

4. తన ముద్దుల పెంపుడు పిల్లిని భుజంమీద కూర్చోబెట్టుకుని కవితలు రాసిన కవి ఎవరు ?

5. పెంపుడు జంతువులతోనూ, పక్షులతోనూ ప్రయాణం చేయడానికి మక్కువ చూపిన సుప్రసిద్ధ కవి ఎవరు ?

6. బహుభాషావేత్త అయిన సుప్రసిద్ధ కల్పనాకథల రచయిత ఎవరు ?

## సమాధానాలు

ఎవరాయన ?

గాలా మాధవరాజు: పూరీలోని జగన్నాథ మందిరం.

లోకజ్ఞానం

1. అహమ్మదాబాదులో.
2. ఉదయ్‌పూర్
3. మన్నార్ జలసంధి
4. రామేశ్వరం
5. శివాలయం
6. ఇక్కడి శివలింగాన్ని శ్రీరాముడు ప్రతిష్ఠించాడని చెబుతారు.

సాహిత్యం

1. అలెక్సీ పియష్కోవ్
2. ఎరిక్ బ్లెయిర్
3. హెక్టర్ హ్యూగో మన్రో
4. ఎడ్గర్ అలెన్ పో
5. లార్డ్ బైరన్. పది గుర్రాలు, ఎనిమిది కుక్కలు, ఐదు పిల్లులు, ఒక డేగ, ఒక కాకితో కలిసి ఆయన ప్రయాణం చేసేవాడు.
6. జాకొబ్ గ్రిమ్ (1785 – 1863)



# నెహ్రూకథ—13

అధికారులు రకరకాల అణచివేత చర్యలకు పూనుకుని, నాయకులను జైళ్ళలో బంధించినప్పటికీ, స్వాతంత్ర్య ఉద్యమం తీవ్రరూపం దాల్చింది. భారత దేశానికి స్వతంత్రం ఇవ్వక తప్పదని బ్రిటిష్ ప్రభుత్వం గ్రహించింది. 1945 వ సం॥ నెహ్రూను జైలునుంచి విడుదల చేశారు.

వైస్రాయ్, నెహ్రూ నాయకత్వంలో తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశాడు. ముస్లింలీగ్ నాయకుడు ఎం. ఏ. జిన్నా, మత ప్రాతిపదికపై దేశాన్ని విభజించాలని పట్టుపట్టాడు. ఆ కోరికను వదులుకోమని, జిన్నాకు నెహ్రూ ఎంతగానో చెప్పి చూశాడు. కాని ప్రయోజనం లేకపోయింది.





రెండవ ప్రపంచ యుద్ధ యోధుడూ, బ్రిటిష్ రాజకుటుంబానికి చెందినవాడూ అయిన లార్డ్ మౌంట్‌బాటెన్, 1947 వ సం॥ ఇండియాకు వైస్రాయ్, గవర్నర్-జనరల్‌గా వచ్చాడు. అధికార మార్పిడి సాఫీగా జరగడానికి అధ్యక్షత వహించమని బ్రిటిష్ ప్రభుత్వం ఆయనను పంపింది.



దేశాన్ని విభజించితీరాలని ముస్లింలీగ్ పట్టుబట్టి, "ప్రత్యక్ష చర్యకు" పిలుపు నిచ్చింది. వాళ్ళు హిందువులపై బడ్డారు; హిందువులు ఎదురుదెబ్బ తీశారు. దేశంలో అక్కడక్కడా ముఖ్యంగా—పంజాబులోనూ, బెంగాల్‌లోనూ మత కలహాలు చెలరేగాయి.

అఖరికి కాంగ్రెస్ దేశ విభజనకు అంగీకరించక తప్పలేదు. నెహ్రూ ఈ నిర్ణయాన్ని 1947 వ సం॥ జూన్ 3 వ తేదీ, రేడియో ద్వారా దేశప్రజలకు తెలియజేశాడు. ఉభయ పక్షాలలోనూ లక్షలాది మంది ప్రజలు చాలా బాధపడ్డారు. వెంటనే దేశ విభజనకు ఏర్పాట్లు జరిగాయి.





1947 వ సం॥ ఆగస్ట్ 15 వ తేదీ మన దేశం స్వాతంత్ర్యం సాధించింది. స్వతంత్ర భారత దేశానికి నెహ్రూ మొట్ట మొదటి ప్రధానమంత్రి అయ్యాడు. నవభారత నిర్మాణానికి పూనుకోవాలని ఆయన ప్రజలకు పిలుపునిచ్చాడు.

ఎన్నో సమస్యలు ఎదురయ్యాయి. **1948** జనవరి **30**వ తేదీన ఢిల్లీలో గాంధీజీ తూటాలకు బలి అయ్యాడు. దేశమే కన్నీటిమయమయింది. నెహ్రూ దిగ్భ్రాంతి చెందాడు. అయినా, దేశ భవితవ్యంకోసం కర్తవ్య నిర్వహణకు పూనుకున్నాడు.






కొందరు సంస్థానాధిపతులు విడిగా స్వతంత్రం కావాలని కలలు గనసాగారు. కొందరు కార్యాచరణకు దిగారు. నిజాం పాలనలోని హైదరాబాదులో హింసాకాండ ప్రబలింది. హైదరాబాదు సంస్థానం స్వతంత్ర దేశంలో లీనం కావాలని కోరే అమాయక ప్రజలపై—సంస్థాన మద్దతుదార్లయిన రజాకార్లు హింసాకాండకు పూనుకున్నారు.

కాశ్మీరు పాలకుడు మహారాజా హరిసింగ్, తన సంస్థానం స్వతంత్ర భారతదేశంలో కలుస్తున్నట్టు ప్రకటించాడు. కాని, దానిని వ్యతిరేకించమని కొందరు కొండజాతుల వాళ్ళను పాకిస్థాన్ ప్రోత్సహించింది. వాళ్ళు తమ బలాన్ని ప్రదర్శించడానికి శ్రీనగర్‌కేసి వెళ్ళారు. కాని, భారత సైన్యం వాళ్ళను తరుమగొట్టింది.





ఇటువంటి పలు సమస్యల మధ్య, నెహ్రూ దేశంలోనూ, ప్రపంచ వ్యాప్తంగానూ శాంతిని నెలకొల్పడానికి అహర్నిశలు కృషిచేశాడు. 1954వ సం॥ భారతదేశానికి విజయం చేసిన చైనా ప్రధాని చౌ-ఎన్-లైతో శాంతియుత సహజీవనానికి దోహదం చేసే 'పంచశీల' సిద్ధాంతాల ఒడంబడికపై సంతకం చేశాడు.

అయితే, 1962వ సం॥ చైనా పంచశీల సిద్ధాంతాన్ని పూర్తిగా అతిక్రమించి భారతదేశంపై దాడి జరిపింది. భారత సైన్యం తమ సరిహద్దులను కాపాడుకోవడానికి వీరోచితంగా పోరాడింది. చైనా సేనలు వెనక్కు మళ్ళాయి. కాని, వారి ప్రవర్తన నెహ్రూకు దిగ్భ్రాంతి కలిగించింది.






17 సంవత్సరాలు భారత ప్రధాని పదవిని నిర్వహించి, దేశాభ్యున్నతికీ, ప్రపంచ శాంతికీ కృషిచేసిన నెహ్రూ, ఈ శతాబ్దంలోని గొప్ప రాజకీయవేత్తగా పేరు గాంచాడు. ఆఖరిశ్వాస ఉన్నంతవరకూ దేశంకోసం, ప్రజల క్షేమంకోసం పాటుపడిన భారత ప్రజల ప్రియతమ నాయకుడు పండిత నెహ్రూ 1964వ సం॥ మే 27వ తేదీన కీర్తిశేషుడయ్యాడు!

—(అయిపోయింది)



# స్వయంవరం

మాళవదేశాన్ని పాలించే మాధవవర్మ వృద్ధుడైపోవడంతో, తన తదనంతరం రాజ్యపాలన ఎవరైనా పరాయివాడి హస్తగతమవుతుందేమో అన్న బెంగపట్టుకున్నది. ఆయనకు పుత్రులులేరు; ఒకే ఒక కుమార్తె. ఆమె పేరు రత్నమాల.

రత్నమాల గొప్ప అందగత్తె, తెలివితేటలు గలది. కాని, ఆమెకు రాజ్యాన్ని పాలించే శక్తిసామర్థ్యాలు కాని, దక్షతగాని లేవు.

మాధవవర్మ తనను పట్టి పీడిస్తున్న సమస్య గురించి మంత్రి సుగుణపాలుడికి చెప్పి, పరిష్కార మార్గం అడిగాడు.

అందుకు మంత్రి, "మహారాజా, మీరీ విషయమై ఏమాత్రం బెంగపడకండి. మన రాజ్యంలో అన్ని విద్యలతోపాటు క్షాత్ర విద్యల్లో కూడా ఆరితేరిన యువకులెందరో వున్నారు. యువరాణికి స్వయంవరం ప్రకటించి, అన్నిటా మిగిలిన యువకుల కన్న మిన్న అని తేలిన యువకుడికి రత్నమాలనిచ్చి వివాహం జరిపించండి. అతడు రాజ్యాన్ని ఏ ఒడిదుడుకులు లేకుండా పరిపాలించగలడు," అని సలహా యిచ్చాడు.

రాజుకు ఈ సలహా నచ్చింది. రత్నమాల అంగీకారంతో ఆయన ఆ విధంగానే రాజ్యమంతటా చాటింపు వేయించాడు.

స్వయంవరానికి వచ్చిన యువకుల మధ్య శాస్త్ర, క్షాత్ర విద్యల్లో పోటీలు జరిగినై. అందులో ప్రతి ఒక్కణ్ణీ అన్ని విద్యల్లో జయవర్మ అనే యువకుడు ఓడించాడు.

మాధవవర్మ అతణ్ణి అభినందించి, "నువ్వు నా కాబోయే అల్లుడివీ, ఈ దేశానికి రాజువూ అని తేలిపోయింది. నా కుమార్తెను వివాహం ఆడి, రాజుగా

పెంటకోట సోమినాయుడు

పట్టాభిషిక్తుడవు కాబోయేముందు, నువ్వు సాధించవలసిన మరొక ముఖ్య కార్యం వున్నది,'' అన్నాడు.

''అదేమిటో చెప్పండి!'' అన్నాడు జయవర్మ.

''రాజధానికి ఉత్తరంగా వున్న అరణ్య ప్రాంతంలో, ఉగ్రశీలుడనే బందిపోట్ల నాయకుడున్నాడు. వాడా ప్రాంతాల ఎంతో కాలంగా ప్రజలను దోచుకుంటూ ఇక్కట్లపాలు చేస్తున్నాడు. వాణ్ణి పట్టి బంధించాలనే నా ప్రయత్నాలు ఫలించ లేదు. మాళవదేశానికి కాబోయే రాజుగా, యిది నీకొక పరీక్షవంటిది. ఏవిధంగానైనా సరే, ఆ ఉగ్రశీలుణ్ణి నువ్వు లొంగ దీయాలి. ఇందుకు అవసరమైన సైనికుల్ని వెంట తీసుకువెళ్ళు.'' అన్నాడు మాధవవర్మ.

జయవర్మ కొద్దిసేపు ఆలోచించి, ''మహారాజా, ఈ పని సైనికులను వెంట బెట్టుకుపోయి సాధించగలిగింది కాదు. వాళ్ళను చూస్తూనే, ఆ బందిపోటు అరణ్యంలో మరొక ప్రాంతానికి పారి పోగలడు. నేను ఒంటరిగా వెళ్ళ దలిచాను,'' అన్నాడు.

ఆ తర్వాత జయవర్మ అరణ్యం ప్రవే శించి, ఉగ్రశీలుడి జాడల గురించి ఆ ప్రాంతాల ప్రజలను అడగసాగాడు. బంది పోటు నాయకుడి అనుచరులు ఈ సంగతి పసికట్టి, జయవర్మను తమ నాయకుడి వద్దకు తీసుకుపోయారు.



జయవర్మ తానెవరైనదీ ఉగ్రశీలుడికి చెప్పి, "నేను, ఈ రాజ్యంలోని వీరు లందరినీ ఓడించాను. రాజు తన కుమార్తెతో నా వివాహం జరిపించి, నాకు సింహాసనం అప్పగించబోతున్నాడు. నన్ను ద్వంద్వయుద్ధంలో ఓడించగలిగితే, రాజ్యం, రాకుమార్తే నీకు లభించగలవు," అన్నాడు.

ఇదివిన్న ఉగ్రశీలుడు మహదానందంతో కత్తి దూశాడు. అప్పుడు జరిగిన ద్వంద్వ యుద్ధంలో వాడు జయవర్మను అవలీలగా ఓడించి, రాజధానికి వెళ్ళి, రాజు మాధవ వర్మను దర్శించి, "మహారాజా, మీరు రాకుమార్తె స్వయంవరానికి పెట్టిన పోటీ లలో అందరినీ ఓడించిన జయవర్మను, నేను ద్వంద్వ యుద్ధంలో చిత్తు చేశాను. అన్నమాట ప్రకారం మీ కుమార్తెను యిచ్చి వివాహం చేసి, రాజ్యాన్ని నాపరం చేయండి," అన్నాడు.

ఈ వింత పరిణామానికి రాజు ఆశ్చర్య పోతూండగా జయవర్మ అక్కడికి వచ్చి, "మహారాజా, ఈ ఉగ్రశీలుడు నన్ను ఓడించానంటున్నాడు. కాని చూసిన వాళ్ళెవరూ లేరు! సభ ఏర్పాటు చేసి, మా యిద్దరి మధ్యా పోటీ జరిపించండి," అన్నాడు.

ఈసారి జరిగిన కత్తి యుద్ధంలో జయ వర్మ, బందిపోటు నాయకుణ్ణి సునాయా సంగా ఓడించి, వాడి కంఠానికి కత్తిని గురిపెట్టి, "ఒరే, మాళవదేశానికి కానున్న



రాజుగా నిన్నాజ్ఞాపిస్తున్నాను. తక్షణం నువ్వు, నీ అనుచరులతో, ఈ రాజ్యం వదిలి ఎక్కడికైనా వెళ్ళిపో!'' అన్నాడు.

ఉగ్రశీలుడు ప్రాణభయంతో గడగడ వణికిపోతూ, రెండు చేతులూ జోడించి, ''మీ ఆజ్ఞ శిరసావహిస్తాను. ఈరోజే నా అనుచరులతో రాజ్యం విడిచి మరొక దేశానికి పోతాను. నేనాడిన మాట తప్పను, మహారాజా,'' అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

ఇది చూసి మాధవవర్మ ఎంతగానో సంతోషించి, రత్నమాలతో జయవర్మ వివాహం జరిపి, రాజ్యానికి అతణ్ణి పట్టాభిషక్తుణ్ణి చేశాడు.

తర్వాత ఒకనాడాయన జయవర్మతో, ''జయా, నువ్వు, బందిపోటు నాయకుణ్ణి వెతుకుతూ వెళ్ళినప్పుడు, నీకెలాంటి ఆపదా కలగకుండా చూడమని కొందరు వేగులను, నీ వెనుకగా పంపించాను. అక్కడ ఉగ్రశీలుడి చేతిలో ఓడిపోయిన నువ్వు, అందరు సభికుల ఎదుటా క్షణాల మీద వాణ్ణి ఓడించావు. ఇదెలా సాధ్యమయింది?'' అన్నాడు.

ఇందుకు జయవర్మ చిరునవ్వు నవ్వి, ''న్యాయనిర్ణేతలు లేకుండా జరిగే ఏ పోటీ అయినా ప్రయోజనంలేనిదే. అందువల్లనే, అరణ్యంలో బందిపోటు నాయకుణ్ణి ఓడించే ప్రయత్నం చేయలేదు. ఇది మొదటి కారణం,'' అన్నాడు.

''మరి రెండవ కారణం?'' అని ప్రశ్నించాడు మాధవవర్మ.

''అరణ్యంలో వాణ్ణి నేను ఓడించి వుంటే, వాడు మీ సమక్షానికి వచ్చేవాడు కాదు. రాజ్యంలో మరొక ప్రాంతానికి పోయి, ప్రజలను దోచుకుంటూండేవాడు. ఇలా ఆలోచించే, వాడికి రాకుమారినీ, రాజ్యాన్నీ ఎరగా చూపించి, యిక్కడికి వచ్చేలా చేశాను,'' అన్నాడు జయవర్మ.

ఈ జవాబు విన్న మాధవవర్మ, తన అల్లుడు విద్యావంతుడూ, ధైర్యవంతుడే కాక, ఎంతో వివేకి కూడా అని గ్రహించి చాలా ఆనందపడ్డాడు.





# కృష్ణావతారం

శిశుపాలుడికి సాల్వుడనే స్నేహితుడున్నాడు. రుక్మిణిని కృష్ణుడు ఎత్తుకుపోయే సందర్భంలో మిగిలినవాళ్ళతో బాటు ఈ సాల్వుడు కూడా ఓడిపోయాడు. అందుకని అతనికి పౌరుషం వచ్చి, లోకంలో యాదవులు లేకుండా చేస్తానని ప్రతిజ్ఞపట్టి, కేవలమూ మట్టి మాత్రమే తింటూ సుదీర్ఘకాలం శివుణ్ణి గురించి దారుణమైన తపస్సు చేసి ప్రత్యక్షం చేసుకుని, తనకు ఎదురులేని విమానం ఒకటి కావాలని కోరాడు. శివుడు చెప్పగా, విశ్వకర్మ దుర్భేద్యమైన నల్లని ఇనుప విమానం ఒకటి తయారు చేసి సాల్వుడికిచ్చాడు. సౌభమనే ఆ విమానం ఎక్కి సాల్వుడు ద్వారక పైకి దాడి వెళ్ళాడు. అతని సేనలు కూడా వచ్చి నగరాన్ని ముట్టడించాయి.

సాల్వుడు విమానం నుంచి రాళ్ళూ, చెట్లూ, ఆయుధాలూ నగరం మీద వేసి బీభత్సం చేశాడు. అతని సేనలు నగరపు ప్రాకారాలనూ, ద్వారాలనూ, తోటలనూ ధ్వంసం చెయ్యసాగాయి. అది చూసి ప్రద్యుమ్నుడు నాయకత్వం వహించి, సాత్యకీ, చారుదేష్ణుడూ, సాంబుడూ, అక్రూరుడూ, కృతవర్మా మొదలైన యోధులనూ, సైన్యాన్నీ వెంటబెట్టుకుని సాల్వుడి పైకి యుద్ధానికి వెళ్ళాడు. అప్పటికి కృష్ణుడింకా పాండవుల వద్దనే ఉన్నాడు.

సాల్వుడి పక్షానికీ, యాదవుల పక్షానికీ మధ్య ఇరవైఏడు రోజులపాటు తీవ్రంగా

29. కుచేలుడి కథ



యుద్ధం జరిగింది. అప్పటికి కృష్ణుడు ద్వారకకు తిరిగివస్తూ యుద్ధ పరిస్థితి గ్రహించి, తన రథాన్ని తిన్నగా సాల్వుడి పైకి తోలించాడు. ఇద్దరికీ యుద్ధం జరిగింది. కృష్ణుడు సౌభ విమానాన్ని భగ్నం చేసి, సముద్రంలో పడేటట్టు చేసి, సాల్వుణ్ణి చక్రాయుధంతో చంపేశాడు.

సాల్వుడు చావగానే అతని స్నేహితుడైన దంతవక్త్రుడు గద ఒకటి తీసుకుని, ఒంటరిగా కృష్ణుడితో యుద్ధానికి వచ్చాడు. కృష్ణుడు దంతవక్త్రుడికి మేనమామ కొడుకే. అతను కూడా ఒక గద తీసుకుని దంతవక్త్రుడితో యుద్ధం చేస్తూ, రొమ్ము పగలగొట్టి అతన్ని చంపేశాడు. సాల్వుడు ప్రారంభించిన యుద్ధం దంతవక్త్రుడి మరణంతో తుదముట్టింది.

కృష్ణుడికి కుచేలుడనే బాల్యస్నేహితుడొకడుండేవాడు. ఇద్దరూ ఒక గురువు దగ్గిరే చదువుకున్నారు. కుచేలుడు పెళ్ళాడి, గృహస్థాశ్రమం గడుపుతున్నాడు. కాని కటిక దారిద్ర్యంతో బాధపడుతున్నాడు. దారిద్ర్య బాధ కుచేలుడి కన్న అతని భార్యకు దుస్సహంగా ఉన్నది. అందుచేత ఆమె ఒకసారి తన భర్తతో, "కృష్ణుడు నీకు స్నేహితుడే గదా? అతను బ్రాహ్మణులకు ఎడతెగని దానా లిస్తాడట. శరణు వేడిన వారిని తప్పక ఆదుకుంటాడట. అలాటప్పుడు, స్నేహితుడివీ, సంసార భారం మోస్తున్నవాడివీ అయిన నీకు సహాయం చెయ్యడా?" అన్నది.

కుచేలుడికి కూడా, సహాయం కోరే వంకన కృష్ణుణ్ణి చూడాలనిపించింది. చూడటంవల్ల లాభం ఉంటుందని కూడా అతనికి తెలుసు. కనక అతను భార్యతో, "కృష్ణుణ్ణి చూడబోతాను. కాని వట్టి చేతులతో కాకుండా అతనికి కానుక ఏదైనా తీసుకుపోతే బాగుంటుంది. అందుకు తగినదేమైనా ఇంట్లో ఉన్నదా?" అని అన్నాడు.

కుచేలుడి భార్య ఇరుగు పొరుగు ఇళ్ళవారి నుంచి నాలుగు గుప్పిళ్ళు అటుకులు

ముష్టి ఎత్తి తెచ్చి, వాటిని చిన్న గుడ్డలో మూట కట్టి, భర్తకిచ్చింది. కుచేలుడు ఆ అటుకుల మూట చేతబట్టుకుని ప్రయాణమై, ద్వారకకు చేరుకుని, కృష్ణుడి ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళాడు.

మంచంమీద పడుకుని ఉన్న కృష్ణుడు కుచేలుణ్ణి చూడగానే లేచి ఎదురు వచ్చి గట్టిగా కౌగలించుకుని, తీసుకు వచ్చి తన మంచంమీద కూర్చోబెట్టి, తానే స్వయంగా కుచేలుడి కాళ్ళు కడిగి, ఆ నీరు నెత్తిన చల్లుకుని, కుచేలుడి శరీరానికి గంధం రాచి, పూలమాలవేసి, దేవుణ్ణి చూసినట్టు చూశాడు. ఒళ్ళంతా మట్టి కొట్టుకుని, చింకిబట్టలు ధరించి, శవాకారంలో ఉన్న ఆ బ్రాహ్మడికి తన భర్త అంత ఆదరం చూపటం గమనించి, రుక్మిణి వింజామర తీసుకుని కుచేలుడికి విసర నారంభించింది. కృష్ణుడు కుచేలుడి పట్ల చూపిన అభిమానానికి అక్కడ ఉన్నవారంతా ఆశ్చర్యపోయారు.

కృష్ణుడు కుచేలుడికి చెయ్యదగిన మర్యాదలన్నీ చేసి, గురుకులంలో చదివిన రోజులనాటి తమ అనుభవాలు నెమరు వేయ నారంభించాడు.

ఒకసారి గురుపత్ని వాళ్ళను సమిధలు తెమ్మని పంపింది. వాళ్ళు ఒక మహా రణ్యంలో ప్రవేశించారు. ఇంతలో ఒక



పెద్ద గాలివాన ఆరంభమయింది. ఆకాశాన మెరుపులు మెరిశాయి. పిడుగులు పడ్డాయి. ఇలా మెరుపులూ, ఉరుములూ సాగుతూండగానే సూర్యాస్తమానమై పోయింది. సమిధలకోసం వచ్చిన వాళ్ళు తడిసి ముద్ద అయిపోయారు. దారి తెలీదు. మిట్టపల్లాలేకమైపోయాయి. ఒకళ్ళ చేతు లొకళ్ళు పట్టుకుని అరణ్యంలో తెల్లవార్లూ తిరగాడారు. మర్నాడు తెల్లవారింది. శిష్యులు అడవిలో చిక్కుపడి పోయారని తెలిసి సాందీపని గురువు వాళ్ళను వెతుక్కుంటూ వచ్చి, దైన్యస్థితిలో ఉన్న కుర్రవాళ్ళను చూసి, "మా కోసం ఎంత ప్రయాసపడ్డారు? ఇంతకన్న ఉత్తమ



శిష్యులు గురువుకు ఏం చెయ్యగలరు ? మీ భక్తికి సంతోషించాను. మీ కోరికలు ఈడేరుతాయి,'' అని ఆశీర్వదించాడు. ఈ సంఘటనను కృష్ణుడు కుచేలుడికి జ్ఞాపకం చేసి, ''గుర్తు ఉన్నదా ?'' అని అడిగాడు.

''నీతో గురుకులవాసస్నేహం చేసిన నా బోటి వాడికి ఏ కోరిక తీరదు ?'' అన్నాడు కుచేలుడు.

కృష్ణు డా మాటకు నవ్వి, ''ఇంతకూ మీ ఇంటి నుంచి నాకేం తెచ్చావు ?'' అని అడిగాడు.

కుచేలుడు కంగారు పడ్డాడు. కృష్ణుడికి తాను తెచ్చిన అటుకు లివ్వాలంటే అతనికి చాలా సిగ్గు వేసింది. కృష్ణుడే బలవంతంగా కుచేలుడి చేతిలో ఉన్న గుడ్డపేలిక మూట తీసుకుని, ''ఇందులోది ఏమిటి ?'' అని అడుగుతూ విప్పి, ''అటుకులే ? నా కెంత ఇష్టమనుకున్నావు !'' అంటూ పిడికెడు నోట వేసుకుని, మరో పిడికెడు చేతిలోకి తీసుకున్నాడు.

''ఆ తిన్నవి చాలు !'' అంటూ రుక్మిణి కృష్ణుడి చెయ్యి పట్టుకున్నది.

ఆ రాత్రి కుచేలుడు కృష్ణుడి ఇంటనే స్నానమూ, భోజనమూ, నిద్రా సుఖంగా చేసి, తాను నిజంగా స్వర్గంలోనే ఉన్నాననుకున్నాడు.

మర్నాడు కుచేలుడు తన ఇంటికి ప్రయాణమయేటప్పుడు కృష్ణుడు అతన్ని కొంతదూరం సాగనంపాడు. తనకు కృష్ణుడు ధనమేమీ ఇవ్వలేదు. అతను తన మనసులో, ''కృష్ణుడు మహారాజు, నేనో హీనుడైన నిరుపేద బ్రాహ్మణ్ణి. బ్రాహ్మణ్ణి కదా అన్న ఆదరంతో నన్ను అతను కౌగలించుకున్నాడు. తనతమ్ముణ్ణి చూసినట్టు చూశాడు. తన భార్య పడుకునే మంచం మీద కూర్చోబెట్టాడు. తన భార్య చేత వింజామర వీయించాడు. దేవుడికి చెయ్యదగినంత మర్యాద చేశాడు. నాకు డబ్బిచ్చినట్టయితే నాకు కళ్ళు నెత్తికొచ్చి

తనను మరిచి పోతాననుకుని కాబోలు ఆ పని చెయ్యలేదు,'' అనుకున్నాడు.

కాని కుచేలుడు తన ఇంటికేసి వెళ్లే సరికి, ఎట్టెదట కళ్ళు జిగేలుమనే రాజ భవనాలు కనిపించాయి. ఉద్యానవనాలూ, సరోవరాలూ కనిపించాయి. వాటిలో రకరకాల పక్షులూ, తామరలూ, కలువలూ కనిపించాయి. భవనంలో దాస దాసీలు తిరుగాడుతున్నారు.

''ఇది ఎవరి ఇల్లయి ఉంటుందీ? నా యిల్లు కాదే! ఇదంతా ఇక్కడ ఎలా వచ్చిందీ?'' అని కుచేలుడు దిగ్భ్రమ చెంది ఉండగా, దేవతలా అన్నట్టున్న స్త్రీ పురుషులు మేళతాళాలతో ఎదురు వచ్చి, భవనంలోకి అతన్ని తీసుకుపోయారు.

మారువేషంలో ఉన్న లక్ష్మీదేవిలాగా కుచేలుడి భార్య వచ్చి తన భర్తను చూసి, కన్నీరు తోసుకు వచ్చే కళ్ళను గట్టిగా మూసుకుని భర్తకు భక్తితో నమస్కరించి, మనసులోనే అతన్ని ఆలింగనం చేసుకున్నది.

ఇదంతా చూసి కుచేలుడు తనలో, ''నాకీ ఐశ్వర్యమంతా కృష్ణుణ్ణి చూసి రావటంచేతనే కలిగి ఉంటుంది. మరో కారణమేదీ కనబడదు. స్నేహితుడంటే అలాగే ఉంటాడు; తాను పుచ్చుకున్నది కొంచెమే అయినా దాన్ని చాలా ఘనంగా భావిస్తాడు; తాను ఇచ్చేది ఎంతో గొప్పదే అయినా దాన్ని అల్పంగానే భావిస్తాడు,'' అనుకున్నాడు.





అటు తరవాత సకలైశ్వర్యాలతో కుచేలుడు తన భార్యతోనూ, బిడ్డలతోనూ సుఖంగా జీవించాడు.

ఒకప్పుడు సంపూర్ణ సూర్యగ్రహణం వచ్చింది. అప్పుడు యాదవులందరూ, అనిరుద్ధుణ్ణి ద్వారకకు రక్షకుడుగా ఉంచి, కురుక్షేత్రానికి బయలుదేరి వెళ్ళారు. అక్కడ కృష్ణుడికి పాత చుట్టాలంతా కలిశారు. నందుడూ, యశోదా వచ్చారు. కుంతి వచ్చింది. భీష్మ ద్రోణులూ, ధృతరాష్ట్రుడూ, సంజయుడూ, విదురుడూ, కృపుడూ, దుర్యోధనుడు మొదలైనవారూ, గాంధారీ, పాండవులూ, వారి భార్యలూ, అందరూ చాలా కాలానికి ఒక చోట సమావేశమయారు. అందరూ కబుర్లు చెప్పుకున్నారు.

ఆ సమయంలో పాండవుల భార్య అయిన ద్రౌపది కృష్ణుడి అష్టభార్యలను, "మీకూ కృష్ణుడికీ ఎలా వివాహాలు జరిగాయి ?" అని అడిగింది.

"నన్ను శిశుపాలుడికివ్వాలని జరాసంధుడు మొదలైన వారంతా నిర్ణయిస్తే, కృష్ణుడు వచ్చి, అందరినీ మట్టి కరిపించి, నన్ను ఎత్తుకుపోయి పెళ్ళి చేసుకున్నాడు," అని రుక్మిణి తన వివాహ వృత్తాంతం చెప్పింది.

"నన్ను మా తండ్రి సత్రాజిత్తు మరెవరికో ఇద్దామనుకున్నాడు. అంతలో నా పినతండ్రి చనిపోయాడు. అది కృష్ణుడి పనేనని మా తండ్రి ఒక అపవాదు వేశాడు. అప్పుడు కృష్ణుడు బయలుదేరి వెళ్ళి, మా పినతండ్రిని చంపిన సింహాన్ని చంపి శ్యమంతకమణిని తీసుకుపోయిన జాంబవంతుణ్ణి జయించి, మణిని తెచ్చి మా తండ్రి కిచ్చి, నన్ను పెళ్ళాడాడు," అన్నది సత్యభామ.

"మా తండ్రి జాంబవంతుడు ఇరవై అయిదు రోజులు కృష్ణుడితో పోరినమీదట, అనాటి రాముడే ఈ కృష్ణుడుగా అవతరించాడని గ్రహించి, ఆయన కాళ్ళు పట్టుకుని, సింహాన్ని చంపి తెచ్చిన శ్యమంతక

మణితో పాటు నన్ను కూడా కృష్ణుడికి అర్పించాడు,'' అన్నది జాంబవతి.

''నేను తన కోసం తపస్సు చేశానని తెలిసి, అర్జునుణ్ణి వెంట పెట్టుకుని నా దగ్గిరికి వచ్చిన కృష్ణుడు నన్ను పెళ్ళాడాడు,'' అని కాళింది చెప్పింది.

''నాకు స్వయంవరం ఏర్పాటయినప్పుడు అనేకమంది రాజులు వచ్చారు. కృష్ణుడు ఆ రాజులందరినీ, జయించి నన్ను పెళ్ళాడాడు,'' అని భద్ర చెప్పింది.

''మా తండ్రి ఏడు ఆబోతులను ఎవరు గెలిస్తే వారికి నన్నిచ్చి పెళ్ళి చేస్తానన్నాడు. కృష్ణుడు వాటిని మేకపిల్లలను లాగా అవలీలగా నిగ్రహించి, నన్ను పెళ్ళాడాడు,'' అని నీళ చెప్పింది.

''నాకు కృష్ణుడు మేనమామ కొడుకే. నాకు అతన్నే పెళ్ళాడాలని ఉన్నదని తెలిసి మా తండ్రి నన్నతనికిచ్చి పెళ్ళి చేశాడు,'' అన్నది మిత్రవింద.

చివరకు లక్షణ తనవివాహ వృత్తాంతాన్ని ఇలా చెప్పింది :

''మీ తండ్రిలాగే మా తండ్రి బృహత్సేనుడు కూడా ఒక మత్స్యయంత్రం ఏర్పాటు చేసి దాన్ని కొట్టినవారికి నన్నిచ్చి పెళ్ళి చేస్తానని ప్రకటించాడు. మీ తండ్రి ఏర్పాటు చేసిన మత్స్యయంత్రం బయటికి కనిపించక పోయినా, లోపలికి కనిపించింది. కాని మా తండ్రి ఏర్పాటు చేసినది బయటా, లోపలా కూడా కనిపించక, నీటిలో దాని ప్రతిబింబం మాత్రమే, అస్పష్టంగా కనిపించింది. దాన్ని కొట్టటానికి మా తండ్రి ఏర్పాటు చేసిన బాణాన్ని చాలా మంది ఎక్కు పెట్టలేకనే పోయారు. జరాసంధుడూ, శిశుపాలుడూ, భీముడూ, దుర్యోధనుడూ, కర్ణుడూ విల్లు ఎక్కుపెట్టి కూడా ప్రతిబింబాన్ని కనిపెట్టలేక పోయారు. అర్జునుడు ప్రతిబింబాన్ని కనిపెట్టి కూడా కొట్టలేక పోయాడు. అప్పుడు కృష్ణుడు వచ్చి, విల్లు ఎక్కుపెట్టి, మత్స్యయంత్రాన్ని కొట్టి, నన్ను పెళ్ళాడాడు.''

ద్రౌపదితోబాటు ఈ కథలన్నీ విన్న స్త్రీలందరూ ఎంతో ఆనందించారు.






# సహజ విద్య

శివశర్మ అనే పండితుడు నడుపుతున్న గురుకులంలో, ముగ్గురు యువకులు ఒకే రోజున వచ్చి చేరారు. కొంతకాలం గడిచాక శివశర్మ, వాళ్ళతో, ''మీ ప్రాథమిక విద్యాభ్యాసం, యీనాటితో పూర్తయింది. ఇకనుంచి మీకు ప్రత్యేకవిద్య దేనినైనా ప్రారంభించాలనుకుంటున్నాను. మీకు ఏయే విద్యలలో ఆసక్తివున్నదో చెప్పండి,'' అన్నాడు.

ముందుగా సునందుడనేవాడు, ''నాకు రాజాస్థానంలో ఉన్నతోద్యోగం చేయాలని ఉన్నది,'' అన్నాడు సాలోచనగా.

రెండవవాడు భూపతి, ''నేను వైద్య శాస్త్రం చదివి గొప్ప వైద్యుణ్ణి కావాలన్నది, మా పెద్దల కోరిక,'' అన్నాడు ఎంతో ఉత్సాహంగా.

మూడవవాడు మాధవుడు, ''నాకు ప్రత్యేకంగా ఫలాని విద్య కావాలన్న ఆలోచన లేదు,'' అంటూ గురువుగారి యిష్టానికే వదిలివేశాడు.

''అన్నిరకాల పాఠాలను గమనిస్తూ వుండి, ఎందులోనైనా ఆసక్తి కలిగితే చెప్పు,'' అని శివశర్మ మాధవుడితో అని, ఆ రోజునే సునందుడికి గణితమూ, అర్థశాస్త్రమూ, భూపతికి వైద్యశాస్త్రమూ ప్రారంభించాడు.

కొన్నినెలలు గడిచాయి. ఒకనాడు శివశర్మ భార్యతో మాట్లాడుతూ యధాలాపంగా, ''ఆ మధ్య గురుకులంలో చేరిన ముగ్గురు కుర్రవాళ్ళలో సునందుడు చురుగ్గానూ, భూపతి ఎంతో శ్రమపడుతూ తమ విద్యల్ని నేర్చుకోగలుగుతున్నారు. మాధవుడి విషయమే అంతుబట్టడం లేదు. వాడు గురుకులంలోనే కనిపించకుండా ఎక్కడో తిరుగుతున్నట్టు వింటున్నాను,'' అన్నాడు విచారంగా.

డా॥ కె. వి. రమణరావు



వాడిచుట్టూ పశులకాపరి కుర్రవాళ్ళు నిశ్చలంగా కూర్చుని వున్నారు. శివశర్మ, మాధవుడి వేణుగానానికి ముగ్ధుడై పోయాడు.

పాట పూర్తయాక ఆయన, వాడి దగ్గిరకు వెళ్ళి, "నీ వింత అద్భుతంగా వేణువు వాయించగలవని, నాకు తెలియదు. ఏనాడూ చెప్పావుకాదేం?" అని ఎంతో వాత్సల్యంగా వాడి భుజం తడుతూ అడిగాడు.

మాధవుడు గురువుకు నమస్కరించి, "క్షమించండి. నేనీ మధ్యనే, యీ కాపరి కుర్రవాళ్ళ దగ్గిర నేర్చుకున్నాను. నేను నేర్చిన యీ విద్య ఏపాటిది!" అన్నాడు.

శివశర్మ, వాణ్ణి ప్రోత్సహిస్తూ, "నీది సహజపాండిత్యం. దీన్ని బాగా అభివృద్ధి చేసుకో," అని ఆశీర్వదించాడు.

విద్యాభ్యాసం పూర్తయాక, సునందుడు రాజాస్థానంలో పెద్ద ఉద్యోగంలో చేరాడు. భూపతి రాజధానిలోనే పెద్ద వైద్యశాల నిర్మించాడు. మాధవుడు మాత్రం వేణుగానం చేస్తూ, ఎన్నో దేశాలు తిరిగి మంచి పేరు తెచ్చుకున్నాడు.

కొన్నేళ్ళ తర్వాత శివశర్మ పని మీద రాజధానికి వెళ్ళి, శిష్యులను చూడాలనిపించి ముందుగా భూపతి దగ్గిరకు వెళ్ళాడు.

ఇంతలో ఆయన ప్రధాన శిష్యుడు అక్కడికి వచ్చి, "గురువుగారూ, మాధవుణ్ణి గురించి తెలుసుకున్నాము. వాడు దాపులనున్న అడవిలో ఎప్పుడూ పశువులకాపర్లతో కాలక్షేపం చేస్తున్నాడు. రేపు మీరే వచ్చి స్వయంగా చూడండి," అని చెప్పాడు.

మర్నాడు శివశర్మ, మాధవుణ్ణి వెతుకుతూ అడవిలోకి బయలుదేరాడు. కొంత దూరం వెళ్ళాక ఒకవైపు నుంచి వేణుగానం వినబడి, అటుకేసి పోయి ఒక అద్భుత దృశ్యం చూశాడు.

ఒక చెట్టుకింద మాధవుడు కూర్చుని, అతిమధురంగా వేణువు వాయిస్తున్నాడు.

కుశలప్రశ్నలయ్యాక, వాడు బోసిగా వున్న వైద్యశాలను గురువుకు చూపుతూ, "గురువుగారూ, ఈ వైద్యశాస్త్ర రహస్యాలు ఎన్నో శ్రమలకోర్చినా, నాకు అంతు చిక్కడం లేదు. నేను కష్టపడి నేర్చుకున్న విద్యవల్ల, నాకేమీ లాభించలేదు, చూశారా!" అన్నాడు.

శివశర్మ, వాడిని ఓదార్చి వెంటబెట్టుకుని సునందుడివద్దకు వెళ్ళాడు. సునందుడు వారికి తన భవనంలో గొప్పగా అతిథ్యమిచ్చాడు.

వాడు మంచి హోదాలో సంపదలతో తులతూగుతున్నా, శివశర్మకు వాడి మాటల్లో, ప్రవర్తనలో, ఏదో వెలితి కనిపించింది.

మాటల సందర్భంలో సునందుడు, "గురువుగారూ, రేపు రాజసభలో మాధవుడి వేణుగాన కచేరీ వున్నది," అన్నాడు.

మర్నాడు ముగ్గురూ రాజసభకు వెళ్ళారు. మాధవుడు పరిసరాలను మరిచి వేణుగానంలో లీనమై అద్భుతంగా వాయించాడు. సభికులంతా తన్మయత్వంతో విని, పాట ముగియగానే పెద్దగా హర్షధ్వానాలు చేశారు.

రాజు స్వయంగా సింహాసనం దిగి వచ్చి, "ఆహాఁ, ఎలాంటి అపూర్వగానం విన్నాను! రాగాలు కొత్తగా జీవం తొణికిసలాడుతూ వున్నాయి. మీరు తప్పక మా ఆస్థాన వేణుగాన విద్వాంసుడుగా వుండాలి," అంటూ మాధవుడికి పెద్ద



పళ్ళెం నిండా బంగారు నాణాలు బహూ కరించాడు.

మాధవుడువినయంగా రాజుకునమస్క రించి, ''దేశాల వెంట తిరిగే నాకు పదవి ఎందుకు, మహారాజా? మీ కళాహృదయం గొప్పది. మీరు అజ్ఞాపించిన వెంటనే ఎక్కడున్నా, మీ సమక్షానికి రాగలను,'' అని తనకు రాజు బహూకరించిన ధనాన్ని అన్నదానసత్రానికి విరాళంగా యిచ్చి వేశాడు.

ఆ రాత్రి శిష్యులు ముగ్గురూ, గురువు సమక్షంలో కూర్చుని వుండగా సునం దుడు, ''గురువుగారూ, నేను అనుకున్న వన్నీ సాధించాను. అయినా జీవితంలో తృప్తి అన్నది లేదు. ఎందుచేత?'' అని అడిగాడు.

దానికి శివశర్మ, ''నువ్వు విద్యను చురుకుగా నేర్చుకోగలిగినా, మొదటి నుంచీ హోదా పైననే దృష్టి నిలపడం వల్ల, జ్ఞానంవల్ల కలిగే తృప్తి నీకు లభించ కుండా పోయింది,'' అన్నాడు.

తర్వాత ఆయన భూపతి వైపు చూసి, ''నువ్వు ధనసంపాదనే ధ్యేయంగా పెట్టు కుని నీ ప్రవృత్తికి సరిపోని వైద్యవృత్తిని ఎన్నుకుని నష్టపోయావు. ఈ విధంగా మీ ఇద్దరూ ఎండమావుల వెంట పరిగెత్తారు. ధనం, కీర్తి, హోదాల్లాంటివి ఆశిస్తే, అవి లభించినా, లభించకపోయినా కూడా తృప్తివుండదు,'' అని ఒక క్షణం ఆగి, ''మాధవుడు మీలాకాక అధికారమూ, ధన సంపాదనలకు ఏమాత్రం పనికి రాదని ముందే తెలిసి కూడా, తనకు సహజంగా నచ్చిన వేణుగానాన్నే పట్టు దలగా నేర్చుకున్నాడు. ఆ కారణంవల్ల, అతని సహజవిద్య తృప్తినీ, ఆనందాన్నీ జీవితకాలమంతా యివ్వగలదు,'' అని చెప్పాడు.

తాము హోదా, ధనకాంక్షలకు దాసులై, తమ సహజ ప్రవృత్తికి తగిన విద్యను విస్మరించి జీవితంలో ఆనందాన్నీ, తృప్తినీ పోగొట్టుకున్నామని సునందుడూ, భూపతీ గ్రహించారు.





# న్యాయదేవత

చీనాదేశంలో చాంగ్ అనే యువకుడు ఉండేవాడు. అతను పేదవాడు. తల్లి దండ్రులను చిన్నతనంలోనే పోగొట్టుకుని చాంగ్ ఆ పనీ, ఈ పనీ చేసుకుని పొట్ట పోసుకుంటూ, తన తండ్రి మిగిల్చిపోయిన ఇంటిలోనే ఉంటున్నాడు.

చాంగ్ ఇంటి సమీపంలోనే ఒక వ్యాపారస్థుడు ఉండేవాడు. తల్లిదండ్రులు లేని చాంగ్‌ను తన కింద నౌకరీకి పెట్టుకుని, ఏదో వంక పెట్టి చాంగ్ ఉంటున్న ఇల్లూ, స్థలమూ కాజెయ్యాలని వ్యాపారి ఎంతో ప్రయత్నించాడు. కాని చాంగ్ వ్యాపారి బుద్ధి బాగా తెలిసినవాడు కావటం చేత అయన కింద పని చెయ్యటానికి ఒప్పుకోలేదు.

చాంగ్ గృహదేవత "టోంగో," ఆమె చీనా వాళ్ళ న్యాయదేవత. చాంగ్ పనికి బయలుదేరే ముందు రోజూ ఎంతో భక్తి శ్రద్ధలతో "టోంగో" విగ్రహానికి దణ్ణం పెట్టుకునేవాడు.

యుక్త వయస్కుడయే నాటికి చాంగ్ చాలా డబ్బు కూడబెట్టాడు. ఆ కుర్రవాడు ఎప్పుడూ ఆనందంతోనూ, ఉత్సాహంగానూ ఉండటం గమనించి వ్యాపారి అసూయ పడ్డాడు. చాంగ్ ఆనందోత్సాహాలకు కారణం ఏమిటో తెలుసుకోవాలని వ్యాపారికి బుద్ధిపుట్టింది. ఒక రాత్రి అయన చాంగ్ ఇంటిని సమీపించి, కిటికీలోనుంచి తొంగిచూసి, నిర్ఘాంతపోయాడు.

చాంగ్ పక్కన ఒక పెద్ద పెట్టె ఉన్నది. చాంగ్ బంగారు నాణాలు ఎంచి అందులో పోస్తున్నాడు; తరవాత అతను తన జేబులో నుంచి కొన్ని చిల్లర నాణాలు తీసి, వాటిని కూడా పెట్టెలో పెట్టి, ఆ పెట్టెను భూమిలో పెట్టి, పైన ఒక కొయ్య పలక కప్పి, ఆ పలక మీద "టోంగో"

చీనా జానపద కథ



విగ్రహాన్నీ, పూజాసామగ్రినీ అమర్చి, ఆ సమీపంలోనే పడుకున్నాడు.

ఇదంతా కళ్ళారా చూసి తన ఇంట్లోకి తిరిగి వచ్చిన వ్యాపారికి ఆ రాత్రి కన్ను మూత బడలేదు. "కుర్రకుంక ఎంత బంగారం పోగు చేసి దాచాడూ! దాన్ని ఏ విధంగానైనా సరే కాజేయాలి," అనుకున్నాడు ఆయన.

మర్నాడు చాంగ్ పనికి వెళ్ళగానే వ్యాపారి ఎలాగో చాంగ్ ఇంట ప్రవేశించి, టోంగో విగ్రహాన్ని పక్కకు జరిపి, పలక ఎత్తి గుంటలో ఉన్న పెట్టె తెరిచి, అందులో ఉన్న బంగారం తీసి తన సంచీలో వేసుకుని, పెట్టె మూసి, పైన పలకా, దాని మీద విగ్రహమూ ఎప్పటిలాగే పెట్టేసి తన ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి చాంగ్ ఇంటికి తిరిగి వచ్చి చూసుకుంటే బంగారం లేదు. చాంగ్ చాలా దిగులుపడ్డాడు. బాగా ఆలోచించి చూడగా, తన బంగారం దొంగిలించిన వాడెవడో తనకు తెలిసినవాడే అయి ఉంటాడని అతనికి అనిపించింది.

తెల్లవారగానే చాంగ్ న్యాయాధికారి వద్దకు వెళ్ళి, జరిగినది చెప్పి, తన సొమ్ము తనకు తిరిగి వచ్చేటట్టు చూడమని వేడుకున్నాడు.

న్యాయాధికారి చాంగ్‌ను పంపేసి, చాలా సేపు ఆలోచించిన మీదట ఆయనకు వ్యాపారి మీదనే అనుమానం కలిగింది. ఏమయినా దొంగను పట్టుకోవలసిన బాధ్యత తన పైన ఉన్నది గనక, రాత్రిళ్ళు చాంగ్ ఇంటివద్ద రహస్యంగా కాపలా కాయటానికి ఒక మనిషిని పెట్టాడు.

రెండు రోజులపాటు చాంగ్ ఇంటి చాయలకు ఎవరూ రాలేదు. కాని మూడో రోజు రాత్రి వ్యాపారి, చాంగ్ ఇంటిని సమీపించి, కిటికీలో నుంచి తొంగి చూడటం కాపలావాడి కంటపడింది. ఈ మాట కాపలావాడు పరిగెత్తుకువచ్చి చెప్పగానే న్యాయాధికారికి వ్యాపారి మీద వున్న అనుమానం రూఢి అయింది.

ఇక వ్యాపారిని దొంగగా పట్టుకోవటం మాత్రమే మిగిలి ఉన్నది. అందుకు గాను న్యాయాధికారి ఒక ఉపాయం ఆలోచించి, దాన్ని చాంగ్‌కు కూడా చెప్పాడు.

నాలుగో రోజు రాత్రి వ్యాపారి వచ్చి కిటికీలో నుంచి చాంగ్ ఇంట్లోకి తొంగి చూసేసరికి ఒక విచిత్రమైన దృశ్యం కనిపించింది.

కిటికీకి వీపు పెట్టి ఒక స్త్రీ నిలబడి ఉన్నది. ఆమెకు ఎదురుగా చాంగ్ మోక రించి కూర్చుని నమస్కరిస్తున్నాడు. ఆ స్త్రీ చాంగ్‌తో, "నాయనా, నీకు నా మీద గల భక్తి నాకు తెలుసు. ఎన్నో తరాలుగా మీ వంశం వాళ్ళు నన్ను పూజిస్తూ వస్తున్నారు. నీకు ఘోరమైన అన్యాయం జరిగిపోయింది. నీ సొమ్ము దొంగిలించిన వాడెవరో నాకు తెలుసు. వాడు దొంగిలిం చిన వెయ్యి బంగారు నాణాలూ నీకు ఇప్పిస్తాను," అన్నది.

ఈ దృశ్యం చూస్తూ మాటలు వింటున్న వ్యాపారి ఆశ్చర్యంగా, "వెయ్యి నాణాలా! నూరేనే? నేను లెక్క పెట్టానే?" అని పైకే అంటూ తన ఇంట్లోకి పరుగు తీసి, తాను కాజేసిన బంగారం ఉన్న సంచీ పైకి తీసి, బంగారు నాణాలను మళ్ళీ లెక్క పెట్టసాగాడు.

అతను అలా లెక్క పెట్టుతుండగా న్యాయాధికారి పదిమంది భటులతో సహా వచ్చి, వ్యాపారిని బంధించి, వ్యాపారి చేత నేరం ఒప్పించి, వ్యాపారికి మూడు నెలల కారాగార శిక్ష విధించి, చాంగ్ సొమ్ము చాంగ్‌కు ఇప్పించాడు.

ఈ సంఘటనతో న్యాయాధికారి ప్రతిష్ఠ పెరిగింది. టోంగోదేవత న్యాయాధికార్లకు ప్రత్యక్షమై సహాయ పడుతుందని ఒక నమ్మకం చీనాలో ఉండేది. కాని అలాటి న్యాయదేవతను చూసిన వాళ్ళు మాత్రం ఎవరూ లేరు.

ఈ న్యాయాధికారికి టోంగోదేవత సహాయం ఉన్నదని ఒక విశ్వాసం ప్రజ లలో వ్యాపించింది. ఆయన హయాంలో అన్యాయాలు బాగా తగ్గాయి.





# ఉషస్సు

సృష్టి జరిగినప్పుడు జలంలోనుంచి భూమి పైకి వచ్చింది. భూమిపై జీవరాసులన్నీ పుట్టాయి. కాని సూర్యుడు లేని కారణం చేత ప్రాణులన్నీ అంధకారంలో ఉండిపోవలసి వచ్చింది.

మనుషులకు క్రూరజంతువుల బాధ హెచ్చుగా ఉన్నది.

చీకటి మూలాన వాళ్ళు పనులు చేసుకోలేకుండా ఉన్నారు.

ఇలా కొంతకాలం జరిగిన తరవాత, మనుషులలో జ్ఞాని అయినవాడొకడు మిగతావారితో ఇలా చెప్పాడు:

"బ్రహ్మదేవుడు మిగిలిన సృష్టితో బాటు సూర్యభగవానుణ్ణి కూడా సృష్టించాడు. మనలో ఎవరైనా బయలుదేరి వెళ్ళి, ఆ సూర్యభగవానుణ్ణి ప్రార్థించినట్టయితే ఆయన అనుగ్రహించి తన కాంతిని మనకు ప్రసాదిస్తాడు. అప్పుడు మనకు కావలసినంత వెలుగూ, వేడీ లభిస్తాయి. క్రూరజంతువుల బాధ తప్పుతుంది. మనం ఎటువంటి ఇబ్బందులూ లేకుండా ఆరోగ్యంతో హాయిగా మన పనులు చేసుకోగలుగుతాం!"

ఈ ఆలోచన అందరికీ నచ్చింది. కాని సూర్యభగవానుణ్ణి ఆహ్వానించటానికి ఎవరు వెళ్ళేట్టు?

అరవైఏళ్ళ తాత ఒకడు, "నాయనలారా, నేను పెద్దవాణ్ణయిపోయాను. నావల్ల మీకెవరికీ కొంచెంకూడా లాభం లేదు. కాని నా కాళ్ళలో ఇంకా శక్తి ఉన్నది. అందువల్ల నేను సూర్యభగవానుడి దగ్గిరికి వెళ్ళి పని పూర్తిచేసుకు వస్తాను," అన్నాడు.

దానికి ఒక పడుచువాడు, "తాతా, ఇది ముసలివాడివల్ల జరిగే పని కాదు. ఎందుకంటే ప్రయాణం ఎంతకాలం పడు

-తుందో ఎవరూ చెప్పలేరు. నేను బయల్దేరి వెళతాను. ఎంతకాలం పట్టినా, దారిలో ఏ కష్టాలు ఎదురైనా తట్టుకోగలను,'' అన్నాడు.

అప్పుడు అక్కడ చేరిన ఒక కుర్రవాడు ఇలా అన్నాడు: ''ఈ ప్రయాణం చాలా ఏళ్ళు పడుతుంది. నేను పదేళ్ళవాణ్ణి. నన్ను పంపినట్టయితే నేను ముసలివాణ్ణి అయేలోపుగా అయినా సూర్యభగవానుణ్ణి తప్పకుండా చేరుకోగలుగుతాను. మీలో ఎవరికీ ఈ దూరప్రయాణం పూర్తిచేసే అవకాశం లేదు.''

అందరూ ఆ కుర్రవాడి మాటలు శ్రద్ధగా విని, ఆ చెప్పిన దాంట్లో కొంత నిజం ఉన్నదని గ్రహించారు.

అప్పుడు జనంలో నుంచి ఇరవైఏళ్ళ ఒక స్త్రీ ఇలా అన్నది: ''నామాట కాస్త వినండి. మీరంతా పెరటి దారినే ఉన్నారు. ఇంత గొప్ప కార్యం ఒక తరంలో జరిగే పనికాదు. దయచేసి నన్ను వెళ్ళనివ్వండి. నేనెలాగూ సూర్యభగవానుణ్ణి చేరుకోలేను. కాని దారిలో పుట్టే నా కొడుకుకైనా, కొన్నాళ్ళ తరవాత ఆ అవకాశం ఉంటుంది!''

ఆ ఆడమనిషి పేరు ఉషస్సు. ఆమె చెప్పిన మాటలు అందరికీ అంగీకారమయాయి.

ఆమె ప్రయాణమైపోతూ, ''నేను వెళ్ళిన దిక్కే చూస్తూ ఉండండి. వెళ్ళిన పని సానుకూలం కాగానే ఒక పెద్ద మంట



వేస్తాను. లేదా నా కొడుకుచేత వేయిస్తాను. ఆ మంట చూడగానే మీకు సూర్య భగవానుడు అనుగ్రహించినట్టు తెలిసి పోతుంది,'' అన్నది.

ఆమె ఒక దిక్కుగా బయలుదేరి ముక్కు సూటిగా నడిచింది. ఆమె అలా ఎనిమిది మాసాలు ప్రయాణంచేసి దారిలో ఒక కొడుకును కన్నది. తరవాత ఇద్దరూ కలిసి ప్రయాణంచేశారు.

ఉషస్సు బయలుదేరి డెబ్బై సంవత్సరాలయింది. ఆమె చాలా ముసలిదయింది. ఆమె తన కొడుకుతో, ''నాయనా, ఇక నేను నడవలేను. మిగిలిన ప్రయాణం నువే పూర్తిచెయ్యి. సూర్యభగవానుడు అనుగ్రహించాక పెద్ద మంట వెయ్యి. దాన్నిచూసి మనవాళ్ళు సంతోషిస్తారు!'' అని చెప్పింది.

ఉషస్సు చెప్పిన మంటకోసం ప్రజలు ఆమె వెళ్ళిన దిక్కుగా ఆసక్తితో చూస్తూ కాచుకుని ఉన్నారు. ఆమె బయలుదేరిన నూరు సంవత్సరాలకు ఆ దిక్కుగా ఎర్రని కాంతి కనపడింది. జనం పరమానందభరితులై, ''అదుగో మన ఉషస్సు! పని పూర్తి అయింది. ఇక మనకోసం సూర్య భగవానుడు త్వరగా ఉదయిస్తాడు!'' అని అప్పటికప్పుడే తమ పనులు ప్రారంభించారు. తరవాత కొద్దిసేపటికే సూర్యుడు ఉదయించి ప్రజలకు కాంతినీ, సౌఖ్యాన్నీ, ఆనందాన్నీ, ఆరోగ్యాన్నీ ప్రసాదించాడు.

ఈనాటికీ పనులు చేసుకునేవారు ఉషస్సుకోసం ఆమె వెళ్ళిన దిక్కుగా చూస్తారు. అదే తూర్పు; ఉషస్సు కనిపించగానే పనులు సాగిస్తారు. సూర్యుడు వచ్చేదాకా ఆగరు.

అంతేగాక మనుషులు ఉషస్సునుంచి ఇంకొక విషయం కూడా తెలుసుకున్నారు. అదేమిటంటే—మనుషులు మహత్తరమైన పనులు సాధించాలంటే అది ఒక మనిషి వల్లా, ఒక్కతరంలోనూ సాధ్యంకాదు; అనేక తరాలవారు దీక్షవహించి అటువంటి పనులు సాధించాలి.



## చెట్లెక్కే ఎండ్రకాయలు!



రాబర్ క్రాబ్ (బర్గస్ లాట్రో) అనే రకం ఎండ్రకాయలు. కొబ్బరికాయలు తినడానికి చెట్లెక్కుతాయి!



పక్షులన్నిటిలోకీ ముళ్ళతోకగల వానకోయిల అత్యంత వేగంగా పయనిస్తుంది. గంటకు 106.75 మైళ్ళ వేగంతో ఇది ఎగురగలదు!

## అత్యంత వేగంగా పయనించే పక్షి!

## మంచునుంచి సంరక్షణ!

ఎత్తయిన కొండలమీద క్రోఫూట్ (రానన్క్యులస్ గ్లాసియాలిస్) అనే అందమైన పువ్వులు పూస్తాయి. ఈ పువ్వులలో స్రవించే మకరందమే, మంచుకు విరుగుడుగా పనిచేసి, వీటికి రక్షణ కల్పిస్తుంది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1990 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



S. B. Takalkar

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జనవరి నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

### నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: బొమ్మల్లో జీవం! రెండవ ఫోటో: పిల్లల్లో దైవం!

పంపినవారు: కె. కె. రావు, నలజాలమ్మ వీధి, గూడూరు—524 101

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.




1975
వనితల స్థితిగతులు
మెరుగుపరచడానికై....

* అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో ఉదయించిన ఏకైక స్త్రీజన పత్రిక ఏది?

# వనిత

* దశాబ్దంన్నరగా స్త్రీలకు ఉపయుక్తమైన అనేక అంశాలను ప్రస్తావిస్తున్న ఏకైక మాస పత్రిక ఏది?

# వనిత

* మరి నెలతల ప్రియనెచ్చెలి ఏది?
నిస్సందేహంగా

# వనిత

1989
వనితలను అభ్యుదయ పథంలో
నడిపించడంలో పదిహేనవ
సంవత్సరం....




కారణం

● విజ్ఞానానికి ● వికాసానికి ● వినోదానికి

# వనిత

చందా వివరాలకు:
విజయా బుక్ హౌస్,
చందమామ బిల్డింగ్స్,
వడపళని, మద్రాసు - 600 026


CHANDAMAMA